# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES.

*[Part II—Proceedings other than Questions and Answers]*

OFFICIAL REPORT.

---

*Thirty-fourth day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY.

*Saturday, the 1st March, 1958.*

The House met at Half Past Eight of the Clock.

*[Mr. Speaker in the Chair]*

## QUESTIONS AND ANSWERS.

(See Part I)

### Fire accidents in Kothagudem Coal Mines.

మిస్టర్ స్పీకర్:— కొత్తగూడెం బొగ్గు గనులలో నిప్పు అంటు కొన్నదని తెలిసింది. దానిని గురించి మంత్రిగారు తెలిసినంత వరకు చెప్పుతారు.

శ్రీ వి. విశ్వేశ్వరరావు (మైలవరం):— అధ్యక్షా, కొత్తగూడెం బొగ్గు గనులను మన రాష్ట్ర ప్రభుత్వమే నిర్వహించు చున్నది. అక్కడ ప్రతి సంవత్సరం చాలా పర్యాయములు ప్రమాదములు జరుగుచున్నవి. మొన్నటి దినం గూడ ఒక ప్రశ్న సందర్భములో అక్కడ ప్రతి సంవత్సరం ప్రమాద ములు జరుగుచున్నవని మంత్రిగారు కూడ అంగీకరించారు. కొంత మంది చనిపోవడం గూడ జరుగు చున్నది.

*The Minister for Labour and social welfare* (*Sri. D. Sanjivayya*):- **Regulation of Labour and Safety in mines and oil fields is a Central Subject, and so the State Government has nothing to do.**

శ్రీ వి. విశ్వేశ్వరరావు.— మన ప్రభుత్వమే నిర్వహిస్తున్నది. కాబట్టి పూర్తి బాధ్యత ఉన్నది. ఆదివారం నాడు అక్కడ నిప్పు అంటుకొన్నదని ప్రభుత్వం ఏమాత్రం, శ్రద్ధ తీసుకోలేదని తరువాత మూడు లక్షల విలువచేసే సామగ్రి పోయిందని తెలిసింది.

మిస్టర్ స్పీకర్:— మీకు ఇచ్చిన మూడు నిమిషములు ఐపోయింది.

*Sri D. Sanjivayya*: According to press reports, fire broke out in one of the coal mines at Kothagudem on Sunday, the 23rd February 1958.

These reports stated that as it was Sunday, there were no workers in the pit and therefore, there was no loss of life or limbs. According to entry 55 to the list I in Schedule VII to the Constitution 'Regulation of Labour and Safety in Mines and Oil Fields' is a Central Subject. Mining accidents are covered by the Mines Act which has to be administered by the Chief Inspector of mines, Dhanbad, and Inspectors working under him make enquiries in case of Mining accidents. The State Government is concerned only with regard to payment of compensation under the Workmen's Compensation Act in case of fatal or serious accidents. As there has been no loss of life or limbs, no report has been received by the State Government in this regard.

In view of the fact that cases of out-break of fire have to be investigated, which is a mining problem, enquiry has to be conducted in this case by the Chief Inspector of Mines. Dhanbad, and not by any Officer of the State Government.

## Bus Accident in Anantapur District

మిస్టర్ స్పీకర్:— రామాచార్యులుగారు అనంతపురం జిల్లాలో జరిగిన బస్సు accident ను గురించి నోటీసు ఇచ్చినారు.

శ్రీ వి. విశ్వేశ్వరరావు:— అధ్యక్షా; నేను గూడ నోటీసు ఇచ్చినాను. కాబట్టి నన్నుగూడ మాట్లాడనివ్వండి.

మిస్టర్ స్పీకర్:— ఇద్దరు ఇచ్చారు కాబట్టి ఇద్దరూ మాట్లాడుతారా ? మీరు ఇచ్చినదానినికొట్టి వేసినాను. రామాచార్యులుగారికి అవకాశం ఇస్తున్నాను.

ముఖ్యమంత్రి (శ్రీ యన్. సంజీవరెడ్డి):— అధ్యక్షా; General policy క్రింద information కు గాను నోటీసు ఇవ్వవచ్చునుగాని ప్రతి దానిపైన నోటీసు ఇవ్వడం గంటల కొలది మాట్లాడ్డం ఏమీ బాగా లేదు. ఇందువల్ల వృధా కాలయాపన అగుచున్నది. కాబట్టి ఈ విషయంలో మీరు consider చేసి రేపు ఒక decision ఇవ్వవలసిందిగా కోరుచున్నాను.

అధ్యక్షా! విచారకరమైన ఈ వార్తను మనమందరము పత్రికలలో చదువుకొన్నాము. ఊహించటానికి వీలుగాని ఘోరప్రమాదము సంభవించినది. ఇంత ఘోరమైన బస్సుప్రమాదం ఇంతకుముందు ఎన్నడూ సంభవించలేదు. మడకసిరి ప్రాంతములో సాయిబాబా వున్నారు. అనంతపురం

వాసినైనా నేను వారిని ఎప్పుడు చూడలేదు. కాని వారిని చూడటానికి చాలా మంది వస్తూవుంటారు. మద్రాసు, మైసూరు రాష్ట్రముల నుండి ఎక్కువ మంది వస్తూవుంటారు ఆ రోజు బుక్కపట్నం నుండి మడకసిరి పోతున్న బస్సులో 51 మంది యాత్రికులు వున్నారు బస్ కెపాసిటి 33 అయినా ఆనాడు 51 మంది ఆ బస్సులో ప్రయాణం చేస్తున్నారు. వారిలో మైసూరు నుండి వచ్చినవారు, మద్రాసు, సేలం నుండి వచ్చిన వారు కూడా వున్నారు. బుక్కపట్నం నుండి బయలుదేరిన బస్ పెనుగొండకు 9 మైళ్ళ దూరములో ఈ ప్రమాదమునకు గురియైనది. బస్ 30 మైళ్ళ స్పీడుకంటె మించి పోవటం లేదు బహుశా ఒవర్‌లోడ్ వల్ల కంట్రోలు తప్పివుండవచ్చు. ఏకారణంవల్లనో కాని ఆ బస్ అక్కడవున్న ఒక ఈత చెట్టుకు గుద్దుకొని ప్రక్కనున్న బావిలో పడిపోయింది. 51 మంది ప్రయాణికులలో 13 మంది పురుషులు, 17 మంది స్త్రీలు, ముగ్గురు మగపిల్లలు, ఆరుగురు ఆడపిల్లలు చనిపోవటం తటస్థించింది. డ్రైవరుకు తలపై దెబ్బ తగిలింది. అతను దూకి పరిగెత్తుకొని పోయాడు. మిగిలిన వారు రక్షింపబడ్డారు. వీరిలో 6 సంవత్సరముల కుర్రవాడు కూడా రక్షింపబడ్డాడు. ఇది దైవికముగా జరిగిన సంఘటన అనిపిస్తున్నది. డ్రైవరు అరెస్టు చేయబడి, హాస్పిటల్‌లో వున్నాడు. అతను ఏమి జరిగినది చెప్పలేని స్థితిలో ఉన్నాడు. Police investigation జరుగుతున్నది. ఇంతకంటె ఈ విచార సంఘటన గూర్చి ఎక్కువ చెప్పలేను. Police investigation పూర్తి అయిన పిదప ఎవరు బాధ్యులో చెప్పగలను. ఈ రోజు వచ్చిన వార్తలనుబట్టి ఆ డ్రైవరు బస్ డ్రైవరుకాదని, లారీ డ్రైవరని తెలుస్తున్నది. అయినా అతను లైసెన్సుగల డ్రైవరే. అన్ని వివరములు వచ్చిన పిదప చెప్పగలను. నేను మన సభ తరపున మరణించిన వారి కుటుంబములకు సంతాపమును తెలియచేస్తున్నాను. శవాలను వారిబంధువులకు అప్పచెప్పారు. 5 స్త్రీల శవాలను గుర్తుపట్టలేదు. వాటిని Photos తీయించి, ఉద్యోగుల స్వాధీనం చేయబడ్డాయి. స్త్రీల వస్తువులు, వారి బంధువులకు వప్పగించబడ్డాయి.

## Report of The Committee of Privileges Relating To Sri Nipani's Case.

*Sri G. Ganga Reddy (Mudhole):* I beg to move:

'That the Report of the Committee of Privileges relating to Sri Nipani's Case, which was presented to the House on 22-11-1957, be adopted.'

*Mr. Speaker:* Motion moved.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ):— On a Point of order, Sir, అధ్యక్షా ! బడ్జెటు డిబేట్ జరుగుచున్నప్పుడు ఇతర విషయాలను చర్చించ కూడదనే Rule ను follow అవుతున్నాము. అయితే ప్రివిలేజెస్ కమిటీవారి నివేదికను adopt చేయాలని ఒక motionను పెట్టారు. డిప్యూటీ స్పీకరుగారు ఇక్కడ లేరు. కాబట్టి దీనిని వాయిదావేస్తే బాగుంటుంది. ఇవాళ ఇది చర్చిస్తే రేపు గోపాలరెడ్డిగారు ఏదో బిల్లు తెచ్చి చర్చించాలని అంటే మనము నిస్సహాయ స్థితిలో వుండవలసి వస్తుంది. అందుచేత ఇటువంటి అవకాశమును కల్పించటం మంచిది కాదేమోననే

విషయం మీ దృష్టికి తీసుకువస్తున్నాను. గవర్నరుగారి ఉత్తర్వు ప్రకారం బడ్జెటు చర్చించటానికి ఈ గంటలను ప్రత్యేకించాము కాని, ఇటువంటి విషయాలను చర్చించటం సాంప్రదాయము కాదేమో నని అభిప్రాయ పడుచున్నాను.

మిస్టర్ స్పీకర్:— బడ్జెటు మీద discussion అనేది House కి సంబంధించినది కాని గవర్నరుగారికి దీనిలో ఏమీ సంబంధము లేదు బడ్జెటు discussion time లో చిన్న చిన్న విషయాలను తీసికోవటములో తప్పులేదు. బిల్లుల సంగతివేరు కాని ఇటువంటివి తీసుకోవచ్చును.

ఒక పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరును admonish చేయాలని హైదరాబాద్ ఎసంబ్లీవారు ఒక తీర్మానము చేస్తే దానిపై కొంత తర్జన భర్జన జరిగిన పిదప అతనిని పిలిపించి, ఎడ్మానిషన్ బదులు ఎప్పాలజి తీసికొన్నాము. ఈ విషయమును 'నిప్పాణి' అనే అతను సరిగా అర్థం చేసుకోకుండా ఏదో వ్రాశాడు. దానిని చూడకుండానే ఇండియన్ ఎక్స్‌ప్రెస్ వారు print చేశారు. వారు దురుద్దేశ్యంతో ప్రచురించ లేదు. నిప్పాణి తెలిసి వ్రాయలేదు. కనుక ఇద్దరు కూడా క్షమించమని కోరారు. వారి క్షమార్పణను ఏకగ్రీవంగా అంగీకరించ వలసిందిగా కమిటీవారు తెలిపారు.

*Mr Speaker:* The question is :

'That the Report of the Committee of Privileges relating to Sri Nipani's Case, which was presented to the House on 22-1-1957, be adopted.

The motion was adopted.

**Report of the Committee of Privileges relating to Sri Vavilala Gopalakrishnayya's case.**

*Sri G. Ganga Reddy:* I beg to move.

"That the Report of the Committee of Privileges relating to Sri Vavilala Gopalakrishnayya's case, which was presented to the House on 22-11-1957 be adopted.

*Mr. Speaker:* Motion moved.

మిస్టర్ స్పీకర్:—ఇది వావిలాల గోపాల కృష్ణయ్య గారి కేసు వ్యవహారము.

ఆయన డిస్ట్రిక్టు ప్లానింగ్ బోర్డు మెంబరుగా ఏదో చెప్పారు. దానిని వారు తలక్రిందులుగా తప్పుగా వ్రాశారు. ఆ విషయములో మంత్రిగారి జవాబుదారి ఏమిలేదు. అక్కడనుండి వచ్చిన రిపోర్టు అలావుంది. గుమాస్తా వ్రాసిన దానిపై కలెక్టరు దస్కతు చేశారు. కలెక్టరుది కూడా

తప్పులేదు. గుమాస్తాకు వార్నింగ్ ఇచ్చి వుంటారు కనుక దీనిని విచారించవలసిన అవసరంలేదని ఏకగ్రీవంగా అంగీకరించవలసినదని కమిటీ వ్రాసింది.

*The Minister for Planning.* (*Sri V. B. Raju*·) No, Sir. The Committee has not recommended such a thing as giving warning to any body.

మిస్టర్ స్పీకర్:— అదంతా మీరు చూచుకోవాలి. రిపోర్టుకు సంబంధించి ఏమీలేదు.

శ్రీ యస్. కె వి. కృష్ణావతారం (తాడేపల్లిగూడెం-జనరల్)·— అధ్యక్షా ! మీకు ఒక విషయం మనవిచేయదలచాను. మీరు "వావిలాల గోపాలకృష్ణయ్యగారి కేసు" అని టైటిల్ పెట్టారు. 'నిప్పాణి' కేసుఅంటే అర్థంవుంది కాని వావిలాల గోపాలకృష్ణయ్య కేసుఅంటే గోపాలకృష్ణయ్యగారు నేరంచేసిన కేసు అని అర్థం అవుతుంది. దీనికి గుంటూరు డిస్ట్రిక్టు ప్లానింగ్ వారి విచారణ అనో, లేక మరో విధంగానో పేరుపెడితే బాగుంటుంది. కాని వావిలాల గోపాలకృష్ణయ్యగారి కేసు అనటం పొరపాటని నేను భావిస్తున్నాను

మిస్టర్ స్పీకర్:— అందులో ఏమీ తప్పులేదు. వావిలాల గోపాలకృష్ణయ్య గారి ఫిర్యాదుకు సంబంధించిన కేసు. దానిని ఫిర్యాది కేసు అనవచ్చు. ముద్దాయి కేసు అనవచ్చు అందులో తప్పులేదు. ఈ report ను accept చేయవలసిందిగా కోరుతున్నారు.

I shall only advise the Government that when the clerk has made a serious mistake they can just warn him or do something departmentally.

*Sri V.B. Raju*· I do not like to participate in the discussion, Sir. But in the light of the Report of the Committee, the Government always examines these things. Particularly, about taking any action I cannot commit here, Sir.

*Mr. Speaker*. It has nothing to do with the Committee Report. But, generally, when a mis-representation is coming from the clerk, I have a right to suggest to the Government to take some action against him. If the hon. Minister accepts it is all right. If he does not accept it, I do not bother.

Sri S. *K. V. Krishnavatharam* · Even if it is a mistake of the clerk, Government has to take the responsibility of the mistake, Sir.

*Mr. Speaker*. They have to see that such things are not repeated. Now the report has to be adopted by the House.

The question is :

'That the Report of the Committee of Privileges relating to Sri. Vavilala Gopalakrishnayya's case, which was presented to the House on 22-11-1957 be adopted.'

The motion was adopted.

శ్రీ జి. ఎల్లమందారెడ్డి (కనిగిరి) :—అధ్యక్షా, మీరు "మంత్రిగారిది, కలెక్టరు గారిది తప్పు కాదు, గుమస్తాది తప్పు" అని అంటున్నారు. ప్రభుత్వానికి, మంత్రులు బాధ్యతవహిస్తున్నప్పుడు, మా ప్రశ్నలకు మంత్రులు సమాధానములు చెప్పుతున్నప్పుడు, ప్రభుత్వానికి బాధ్యత వహిస్తున్నది మంత్రులో, శక్రటరీలో, గుమస్తాలో, నిదానంగా ఆలోచించి రూలింగ్ యివ్వమని కోరుతున్నాను.

## Paper Laid on the Table of the House

### Amendment to the Andhra Public Service Commission Regulation

*Sri N. Sanjeeva Reddi* · Mr. Speaker, Sir, I beg to lay on the Table of the House, a copy of Notification issued with G. O. Ms. No. 123, General Administration (Service-A) dated 24-1-1958 making an amendment to the Andhra Public Service Commission Regulations in accordance with clause (5) of Article 320 of the Constitution.

*Mr. Speaker* . Paper laid on the Table.

## BUDGET—GENERAL DISCUSSION

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—అధ్యక్షా, మంత్రిగారు బడ్జెటును ప్రవేశపెడుతూ గత సంవత్సరమంతో విషాదములో మునిగి పోయాము. ఈ సంవత్సరము ఆనంద పరవశులముగా ఉన్నామని అన్నారు. దానికి కారణము మిగులు బడ్జెటును present చేయడమేనని తెలియజేశారు. దీనికి వారు ఆనంద భైరవికూడ ఆలాపించారు . క్రిందటి సంవత్సరము ఆరుకోట్ల రూపాయలు లోటుగా ఉన్న బడ్జెటును, ఒక్కసారి మిగులుగా మార్చేశారు. అది ఏ విధముగా మార్చారు అన్నది కొన్ని లెక్కలను పరిశీలించి నట్లయితే బోధ పడుతుంది. కాని ఆర్థిక మంత్రిగారు కొన్ని కారణములు తెలియజేశారు. కేంద్రం నుంచి కొంత ఆదాయం వచ్చింది, తరువాత పన్నుల ద్వారా కొంత ఆదాయం వచ్చింది, కాబట్టి లోట బడ్జెటు మిగులుగా మారిందని చెప్పారు. న్యాయంగా చూస్తే అది నిజం మాత్రం కాదని నేను రుజువు చేస్తున్నాను.

ఈ వివరాలు తయారు చేయుటలో నాకు వ్యవధి చాలా తక్కువగానే యున్నప్పటికిని, కొన్ని వివరాలు సభవారికి అందిస్తున్నాను. ఈ సభవారు ఆమోదించినటువంటి, అనేక పద్దులకై, కేటాయించిన మొత్తాలను ప్రభుత్వం ఖర్చు చేయలేదు. ఆ ఖర్చు చేయకుండా మిగిలి పోయిన, గత సంవత్సర మొత్తాలే దాదాపు ఆరుకోట్ల రూపాయల వరకు ఉన్నవి. మనం ఆమోదించినటువంటి పద్దులను ఈ విధముగా ఖర్చు చేయక పోవుట గర్హించదగిన విషయము. కొన్ని కొన్ని పద్దులలో ఒక్కదమ్మిడీ కూడ ఖర్చుచేయ

లేదు. ఇంక్రీజు ఆఫ్ డియర్నెస్ అలవెన్సు క్రింద 3 లక్షల 11 వేలు allot చేశారు అందులో ఒక్క పైసకూడ ముట్టకుండా ఆ మొత్తాన్నిపొదుపు ఉద్యమములోకిచేర్చారు డిస్ట్రిక్ట్స్ మొదలైన వాటి 26 లక్షల రూపాయలు కేటాయిస్తే 19 లక్షలు మాత్రమే ఖర్చు పెట్టడం జరిగింది.

Public Health Department పద్దు క్రింద చాలా మొత్తం ఖర్చు పెట్టకుండా ఉంచారు. దీనిని ప్రధానంగా మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను. డిమాండు నెం. 19 లో చూచినట్లయితే Maternity and Child Welfare Centre కు 10 లక్షలు కేటాయించి 8 లక్షలు మాత్రమే ఖర్చు చేయుట జరిగింది బ్యూరో ఆఫ్ లేబరేటరీస్‌కు రెండు లక్షం ముప్పది వేలు కేటాయిస్తే, ఒక దమ్మిడి కూడ ఖర్చు చేయబడలేదు. నీలోఫర్ మెటర్నిటి హాస్పటలుకు 3 లక్షల శాంక్షన్ చేస్తే ఆ మొత్తం అలాగే ఉండిపోయింది. "Training of Sanitary Inspectors, and staff of rural sanitation" కు లక్ష రూపాయలు మంజూరు చేస్తే అందులో ఒక్క పైస ఖర్చు కాలేదు Primary Health Centre కు 4 లక్షలు 50 వేలు ఉంటే ఖర్చు సున్నా! అధ్యక్షా, ఈ విధముగా ప్రజలకు సంబంధించినటువంటి ముఖ్య కార్యక్రమాలలో ఖర్చు చేయకుండా ఉండుట క్షంతవ్యమైన విషయముకాదు. మామూలు పద్దులు అయితే అంతగా బాధ పడ నక్కరలేదు. విద్య, ఆరోగ్యము మొదలైన వాటికి ఖర్చుచేయు లేదంటే, ఈ ప్రభుత్వాన్ని ఏమనాలో అర్థంకావడం లేదు. డిమాండు నెం. 17 ను చూచినట్లయితే గవర్నమెంటు ప్రొఫెషనల్ కాలేజీలకు 29 లక్షలు కేటాయించి, 23 లక్షలు మాత్రమే ఖర్చు పెట్టారు. Education పద్దు క్రింద కూడా చాలా డబ్బు ఖర్చు చేయలేదు. గవర్నమెంటు ఎయిడెడ్ స్కూల్సుకు, 22 లక్షలు కేటాయించి ఒక్క దమ్మిడీ ఖర్చు చేయలేదు. Local Boards schools కు 17 లక్షలు కేటాయించారు. అది అట్లానే ఉంది. అదే విధముగా "lumpsum Provision for ncreased D.A" క్రింద 7 లక్షలు కేటాయించారు. దానిలో కూడా ఖర్చుపెట్టింది ఏమీలేదు. వీటి అన్నిటికన్నారోడ్ల విషయంలో చూచినట్లయితేఒక గవర్నరుగారి భవనానికిమాత్రం, అనుకొన్నదానిని చక్కగా వినియోగించుకోగలిగారు. మిగిలిన వాటికి ఎందుకు ప్రాముఖ్యత యివ్వలేదో నాకు అర్థం కాకుండా ఉన్నది. దీనిని బట్టి చూచినట్లయితే అధికారులకు, కావలసిన సదుపాయాల విషయంలోనే ప్రభుత్వం ఎక్కువ శ్రద్ధ చూపుతున్నది. గాని, ప్రజావసర కార్యక్రమాల అమలుకు అంత ప్రాధాన్యత యిచ్చుట లేదని తేట తెల్లమవుతుంది. General Administration కు 97 లక్షలు కేటాయిస్తే 104 లక్షలు ఖర్చు పెట్టారు. అధ్యక్షా, వారు ఈ విషయాలు జాగ్రత్తగా వినాలి.

ఆర్థిక మంత్రి (డాక్టర్ బి. గోపాలరెడ్డి):— జాగ్రత్తగా వినుటలేదని ఆరోపణ చేయుట న్యాయము కాదు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—వారు ఊహించుకొన్నారు. నేను ఆరోపణ చేయలేదు.

పోలీసుకు రూ. 15 లక్షలు కేటాయిస్తే రూ. 19 లక్షలు ఖర్చు పెట్టారు. Medical కు రూ. 73 లక్షలు కేటాయిస్తే రూ. 53 లక్షలు ఖర్చు పెట్టి రూ. 20 లక్షలు దాచుకున్నారు.

Education కు రూ. 51 లక్షలు కేటాయిస్తే రూ 44 లక్షలు ఖర్చు పెట్టారు. Stationary and Printingకు రూ.5లక్షలు కేటాయిస్తే రూ.15 వేలతోముగించుకొన్నారు. Communicationsకు రూ. 76 లక్షలు కేటాయిస్తే రూ. 56 లక్షలు ఖర్చు పెట్టి రూ. 20 లక్షలు మిగల్చుకొన్నారు. ఈ రకంగా యివన్నీలెక్క వేసినట్లయితే మొత్తం సుమారు రూ. 6కోట్లు వచ్చాయి. ఇంకా లెఖ్కలు తీసినట్లయితే, యీ పద్దు పెరుగుతుందే కాని తగ్గదు. ఈ సందర్భంలో నేను మీ ద్వారా మంత్రివర్గానికి చెప్పేదేమిటంటే, ఏదయినా పని మీరు ప్రారంభించ తలచుకుంటే, కార్యక్రమాన్ని తయారుచేసికొని అందుకే allotment అడగండి. Estimates ప్రారంభమయ్యాయని తీసుకు వచ్చి మాచేత వోటు చేయించుకొని, ప్రజలలో ఆశ కల్పించిన తరువాత మీరు దానిని ఖర్చు పెట్టకుండా అట్టేపెట్టితే, మీ పైన, మా పైన కూడ అవిశ్వాసం ప్రబలడానికి కారణమవుతుంది అని నేను మీ దృష్టికి తీసుకు వస్తున్నాను. అందువల్ల ఈ విషయంలో జాగ్రత్తగా వ్యవహరించవలెనని చెబుతున్నాను.

మిస్టర్ స్పీకర్:—ఎవరి దృష్టికండి ?

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—మీదృష్టికి అంటే మీద్వారా "వారు." వారంటే ప్రభుత్వం వారు.

*Mr. Speaker :* Kindly use parliamentary language.

*Sri Pillalamarri Venkateswarlu* : There is an impersonal aspect in Parliamentary language.

Finance Commission వారి సిఫార్సుల ప్రకారం కేంద్ర ప్రభుత్వం మనకిచ్చే వాటాలో కొంత పెరుగుదల వచ్చిన మాట వాస్తవమే, కానీ మన రాష్ట్రంనుంచి కేంద్రం వసూలు చేసే పన్నులకు ఇది సరైన వాటా కాదు. Planning Commission ఈ రోజున మన రాష్ట్రంలో రూ. 30 కోట్లు ఖర్చు పెట్ట బోతోంది. పూర్వమున్న understanding ప్రకారం కేంద్ర ప్రభుత్వం రూ. 20 కోట్లు, మనం రూ. 10 కోట్లు భరించవలసివుంది. కానీ యీ నాడు కేంద్ర ప్రభుత్వం రూ.18 కోట్లు మాత్రమే పెట్టుకొంటోంది. అంటే ఆ విధంగా రూ. 2కోట్లు తగ్గింది అన్నమాట. కేంద్ర ప్రభుత్వం అనేకపన్నులు ద్వారా మన వద్ద వసూలు చేస్తున్న మొత్తాన్నే మనకు ముదరా యిచ్చారన్నమాట. వారు మన కేదో పెద్ద మెహర్‌భానీ చేసారను కోవటం చాలాపొరపాటు. 1957—58 సంవత్సరం Budget సమావేశంనుంచి మన శాసన సభ ఎప్పుడు సమావేశమైనా పన్నులు వేసే కార్యక్రమాన్నే చర్చిస్తూ వచ్చింది. ఇవన్నీ చూసినట్లయితే మనమీద పన్నుల భారం కూడా విపరీతంగా పెరిగిపోతోంది. ఈ సంవత్సరం యిప్పుడు మనకిచ్చిన అంచనాల ప్రకారం రైతాంగం మీద రెండు కోట్లకు పైగా పన్నులు వేయడం జరిగింది. ఈవిధంగా మనం యివన్నీ పోల్చిచూస్తే కేంద్ర ప్రభుత్వం కొంత ఎక్కువ యిచ్చిన మాట వాస్తవమే. కానీ ఎంత ఎక్కువ రావాలో, మనకు ఎంతవస్తే మన అభివృద్ధికార్యక్రమాలు కొనసాగడానికి వీలు వుంటుందో , అంత ఎక్కువ యివ్వలేదనే విషయం స్పష్టంగా బోధ పడుతుంది. పెద్ద ప్రాజెక్టులు ఎంత త్వరగా పూర్తి అయితే, జాతీయ ఆదాయం అంత త్వరగానూ, అంత ఎక్కువగానూ పెరుగుతుంది. కేంద్రప్రభుత్వ వైఖరి మాత్రం యిందుకు వుపకరించటంలేదు. ఒకపెద్ద

Project ను తీసుకొని, త్వరగా పూర్తి చేయడానికి National resources అన్నీ కూడా కేంద్రీకరించకుండా, ఆంధ్రకోసం గట్టిగా అడిగేవారు ఎవరూ లేరని, ఎంతోకొంత మొత్తం యివ్వడం జరుగుతోంది. నాగార్జునసాగరం ప్రాజెక్టుకోసం రూ. 11 కోట్లు అడిగితే రూ. 7—8 కోట్లు యివ్వడం జరిగింది. ఆ నాడు యావత్ ప్రజానీకం పెద్ద ఆందోళన చేసి కేంద్రం చేత నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు, తుంగభద్ర ఎగువ కాల్వకు ఒప్పించుకొన్నారు.

తుంగభద్ర ఎగువకాలవ రాయలసీమకు చాలా ప్రాముఖ్యమైనది. శ్రీ సంజీవరెడ్డిగారు దీనికోసం ఎంతో పాటుపడి sanction చేయించామనిచెప్పారు. ఈ ఎగువకాల్వకు సంవత్సరానికి రూ. 40 లక్షలు మాత్రంకేటాయించడం జరిగింది. ఇది సుమారు రూ.13 కోట్ల ప్రాజక్టు. ఈడబ్బుకేటాయింపు యిదేవిధంగా సాగితే యీపనిని ఎన్నిసంవత్సరాలకుపూర్తిచేయగలుగుతారో ఒక్కసారిఆలోచించమని విజ్ఞప్తి చేస్తున్నాను. ఇప్పుడుకేటాయిస్తున్న డబ్బు officers జీత, భత్యాలకే సరిపోతుందికాని ఒకమైలు కాలవ త్రవ్వడానికి కూడాఅవకాసంలేని పరిస్థితిలో వున్నదని మీదృష్టికి తీసుకువస్తున్నాను. Finance Commission వారి report చూస్తేమన ప్రభుత్వానికి సుమారు 140కోట్లు అప్పువున్నట్లు తెలుసస్తోంది. అందులో ఎక్కువభాగం 4%, $4\frac{1}{2}$%వడ్డీరేటులో మనకు కేటాయించడంజరిగింది. అందువల్ల ఈవడ్డీల క్రిందే మనం సుమారు ఆరుకోట్లు ఖర్చుపెడుతున్నాము.

ఇది కూడా చాలా పెద్ద మొత్తం. కేంద్రప్రభుత్వం మనదగ్గరనుంచి రు6 కోట్లు వడ్డీరూపేణా వసూలుచేయడం ఒక వ్యాపారంగా కనిపిస్తున్నది. కొన్నిగ్రామాలలోను ముఖ్యంగా చిన్నపట్టణాలలోను కేవలం అప్పులివ్వడంకోసంకొన్ని Banks పెడతారు. వారునూటికి నెలకు రూ. 12—15 లు వడ్డీ వసూలు చేస్తారు. ఆపద్ధతిలో కేంద్ర ప్రభుత్వవిధానం కనిపిస్తున్నది. Finance Commission వారిసిఫార్సులను కేంద్రం అంగీకరించినట్లు పత్రికలలో చూసి చాలా సంతోసించాం. వడ్డీరేటు ఎంత తగ్గుతుందోనని లెక్కలు చూసుకోవడం ప్రారంభించాం. కాని యిప్పుడు మంత్రిగారు మాట్లాడుతూ కేంద్ర ప్రభుత్వం యింకా Finance Commission report ను అంగీకరించలేదని చెప్పారు. వడ్డీరేటుతగ్గకపోతే మనకు చాలా యిబ్బందులున్నాయి. ఒక పెద్ద ప్రాజెక్టుకొరకు అప్పుయిచ్చినప్పుడు ఆ ప్రాజక్టుపూర్తి అయినప్పటినుంచి వడ్డీవసూలుచేయడం న్యాయం. ఒక private individual ఏవర్తకుని వద్దో, ఏ Bank వద్దో అప్పుతీసుకొంటే, దాన్నివెంటనే పరిశ్రమలో గాని పొలంలోకాని వుపయోగించుకొని ఆదాయం సంపాదించుకొనుటకు అవకాసంవుంటుంది. కాని ప్రభుత్వంపెద్దపెద్ద Projectes కు కొన్ని కోట్లరూపాయలు productive side న sink చేసినప్పుడు అది పూర్తికాకుండా results చేతికందకుండావడ్డీ చెల్లించడంన్యాయంకాదు. అట్లాకాని పక్షంలో ప్రభుత్వం ప్రజలపై ఎన్నిరెట్లు పన్నులు అదనంగావేసినా ఆవచ్చేసొమ్ము ఈ వడ్డీతీర్చడానికే సరిపోదు. ఈవిషయాన్నిదృష్టిలోవుంచుకొని నాగార్జునసాగర్ ప్రాజక్టుకు యిచ్చే అప్పుపైన ప్రాజెక్టు పూర్తిఅయి మనకు (return) ప్రతిఫలంవచ్చే రోజునుంచి వడ్డీయిస్తామనే షరతుకు కేంద్రాన్ని ఒప్పించాలి. నాగార్జునసాగర్ ప్రాజక్టునిర్మాణంలోయింతవరకు రు. 40 లక్షలు పొదుపుచేశామనిచెప్పారు. అది చాలా సంతోషించవలసినవిషయం. అక్కడఖర్చుపెట్టే. డబ్బు దుర్వినియోగంకాకుండా చర్యలు తీసుకోవలసి వుంది. ఈనాడుమనంఅనేక ప్రధాన సమస్యలను ఎదుర్కొంటున్నాము. విశాలాంధ్ర ఏర్పడి

నప్పటినుంచి యివి మరీ ఎక్కువయినాయి. వీటన్నిటినీ పరిష్కరించుకోవలసిన అవసరంఎంతైనావుంది దురదృష్టవశాత్తూ ఈసమస్యలన్నీ మంత్రివర్గంఏర్పడ్డాకే ఉదయించాయి. Integration of laws అన్నారు. ఇవి ఏవిధంగాచెయ్యాలని ఆలోచించడానికి మారుగా, మా Departments లో చాలా తెలివైన I.C.S officers వున్నారని చెప్పి Departments ద్వారా చేయించడం చాలా పొరపాటు అని నేను మంత్రి వర్గానికి మనవిచేస్తున్నాను.

అక్కడనుంచి వచ్చినవారిలో బాగా అనుభవంగల మంత్రులు మాజీమంత్రులు, సభ్యులుగావున్న High Court వకీళ్ళు, వీళ్ళందరూ సావధానంగా కూర్చొని, ఈ తెలంగాణా చట్టాలలో మంచి చెడ్డలను గుర్తించడానికి అవకాశం ఇవ్వకుండా లేక బయటనుంచి కొంతమందిని తీసుకు వచ్చి Law Commission వేసి, ఆంధ్ర, తెలంగాణా చట్టాలలో లోపాలను సరిదిద్దించకుండా, కేవలం Officer లు మీద Secretary లమీద ఆధారపడి అన్నివిషయాలు వాళ్ళకు పూర్తిగా తెలుసు లనుకోవడం చాలా పొరపాటు. చట్టాలను వాళ్ళు క్షుణ్ణంగా చదివి వుండవచ్చు, ఏ clause లో ఏ implications ఉన్నవో తెలుసుకుని వుండవచ్చు. అంతమాత్రాన వారిమీద ఆధారపడి వాళ్ళు తయారు చేసుకు వచ్చిన Act లను, బిల్లులను, తు.చ. తప్పకుండా pass కావలిసిందేనని, ఇక్కడకోరడం పొరపాటు.

ప్రజల ఎన్నికద్వారా వచ్చినటువంటి మనం Legal knowledge ఉన్నటువంటి pleaders, ఇక్కడసభ్యులుగావున్నపుడు పార్టీవిబేధాలు లేకుండా, అందరూకలసి ఆలోచిస్తేనే ప్రజలకు, ప్రభుత్వానికి , ఉపయోగకరమైనటువంటి చట్టాలు తయారవుతాయి.

మొన్ననే, ఒకబిల్లును అన్నిపక్షాలవారము, Select Committee కి పంపించాలని కోరాము. మా విన్నపానికి విరుద్ధంగా Bill pass కావలిసిందేనని pass చెయ్యడం జరిగింది.

ఈ integration వల్ల వచ్చేకష్టాలు చాలావున్నాయని అనేకమంది point out చేస్తూవున్నారు అసలు ఈ integration of laws అనేది ఒక Law Commission వంటిది చేయవలసినపని. దీనిని ప్రజల సహకారంద్వారా చెయ్యవలసిన అవసరం ఎంతైనా వుందని మీ దృష్టికి తీసుకువస్తున్నాను.

రాష్ట్రం ఏర్పడక పూర్వం విశాలాంధ్ర వస్తుంది అంటే, ఆంధ్ర ప్రాంతంలో ఉన్న ఉద్యోగస్తులందరూ ఎంతో సంతోషించారు. వెంటనే రావాలన్నారు. దీనికి కారణంవారు ప్రత్యేకమైనటువంటి సౌకర్యాలను ఆసించారు. తుదకు కొద్దిపాటి సౌకర్యాలైనా పొందగలమని, ఆశించారు. కాని, ప్రభుత్వం వారిని పూర్తిగా నిరుత్సాహపరచింది, అంతేకాకుండా నిందించారుకూడా. అందువల్ల తెలియజేసేది ఏమనగా ఉద్యోగస్తులు legal గా ఉండాలన్నప్పుడు, వారితో పని బాగాచేయించుకోవాలన్నప్పుడు, వారికి నేడు యిస్తున్నటువంటి జీతాలు, భత్యాలు సద్వినియోగం కావాలన్నప్పుడు, ఈ pay scales లో తారతమ్యము లేకుండా ఉభయ ప్రాంతాలవారికి ఒకే రకమైన scales నిర్ణయించాలని విన్నవిస్తున్నాను. ఈ విషయంలో తెలంగాణా సోదరులను ప్రత్యేకంగా అభినందిస్తున్నాను. రాష్ట్రం ఏర్పడక ముందే, ఇక్కడ జీతాలు తగ్గించకూడదు అన్నటువంటి, హామీని పొందడములో వారు చాల

విజ్ఞత ప్రదర్శించారు లేకపోతే తప్పకుండ ఈనాటికివారి జీతాలను తగ్గించి వుండేవారు. కావలసిస్తుంటే కొన్నింటిలో, వారికి ఏ విధంగా తగ్గించాలో, నేను point out చెయ్యగలను.

ఈ Services విషయంలో, అక్కడనుంచి వచ్చినవాళ్ళు ఇక్కడివారితో సమానమైన జీతాలు ఇయ్యాలని అడుగుతున్నప్పుడు దానికి ముఖ్యమంత్రిగారు చాల ఛలోక్తిగా సమాధానమిస్తూ ఇమ్మంలో పెట్టవలసిన కాలేజీని ఆపువెయ్యమంటారా? లేక గుంటూరులో అభివృద్ధి చెయ్యదలచుకొన్న Hospital ను, ఆపుచెయ్యమంటారా? Kurnool లో Medical College ని మూసి వెయ్యమంటారా? లేక ఈ N. G. O. ల జీతాలు పెంచడానికి ప్రత్యేకంగా ఈ N. G. O. ల fund గురించి, ఏదైనా ఒక పన్ను వెయ్యమంటారా, అని ప్రశ్నలు వెయ్యడం మొదలు పెట్టారు. ఈలాంటి సమాధానాలు ఇవ్వడం ఏమంత కష్టమైన పని కాదు. అదే ధోరణిలో నేనుకూడ వారిని కొన్ని ప్రశ్నలు వేస్తాను (1) ఇప్పుడు మంత్రులు చేస్తున్న ఖర్చుకు ప్రత్యేకమైన పన్నువేశామా? (2) వారి Travelling Allowance లకు ప్రత్యేక పన్ను వేశామా? లేక (3) మనమందరమూ నెలకు 150/— రూపాయలు తీసుకోవడానికి, ప్రత్యేకంగా ఎక్కువ పన్ను వేసుకున్నామా ?

ఈ రోజు ఇది ఒక జాతీయ సమస్యగా మన ముందు వున్నది. ప్రక్కన కూర్చున్నటువంటి సోదరుల్లో మనస్పర్ధలు ద్వేషాలు ఎక్కువయిపోతున్నవి. వీటినన్నిటిని తొలగించేబాధ్యత ప్రభుత్వం మీద వున్నది ఈ జీతాల హెచ్చింపుకు ఒక కోటో, రెండు కోట్లో అదనంగా ఖర్చుకావచ్చు. కానియ్యండి. నష్టం ఏమీ లేదు. వారినుండి work ఎక్కువగా extract చేయించుకో గల్గుతాము. ఇవన్నీ ఆలోచించకుండా వాళ్ళంతా సుఖంగానే ఉంటున్నారులే అనే ధోరణిలో మాట్లాడితే ప్రయోజనం ఏమీలేదు.

అంతేకాకుండా ఈ promotions లో officers కు Jobs allot చెయ్యడంలో వాళ్ళలో వాళ్ళకే చాల అసంతృప్తి కలుగుతున్నది. ఇలా, ఎందువల్ల కలుగుతుందో ఆలోచించాలి. దానిని పరిష్కరించే మార్గాన్ని ఆలోచించాలి.

ఆంధ్ర, తెలంగాణా ప్రజల మధ్య ఏ రకమైనటువంటి విభేదాలు లేకుండా, సోదర భావంగా ఉండేలాగు, అవకాశాలుకల్పించాలి. పరస్పర అభిప్రాయభేదాలున్నప్పుడు, వాటిని పాటించకుండ, వారికి నచ్చ జెప్పి వారి విశ్వాసాన్ని పొందాలి.

Osmania University Vice-Chancellor నియామకమే దీనికి తార్కాణము. విద్యార్థిలోకం అంతా తల్లడిల్లిపోయింది. దానికికారణం, కేవలం ఆంధ్ర ప్రాంతం మీద ద్వేషంఉండి అని అనుకోవడంచాల పొరపాటు. అవలబించే పద్ధతులు తప్పు. వారు అడిగింది మంచోచెడ్డో కొంతకాలంవారి ఇష్టానుసారంగా కొనసాగించాలి. పరస్పర ఆత్మ విశ్వాసం కలిగించాలి. ఇప్పటికైనా మునిగిపోయింది ఏమీలేదు. వారితో సరిఅయిన వాతావరణం కలుగచెయ్యాలని కోరుతున్నాను.

ఇంకోవిషయం ఏమంటే, ఈ Mufusil లో ఉన్న ఉద్యోగులకు అదనంగా 6 రూ. కరువు భత్యం వర్తింపజెయ్యడంలేదని వాళ్ళు గోలపెడుతున్నారు. ధరలు పెరిగినాయి అనే విషయం తెలిసుండికూడ వారిని నిర్లక్ష్యం చెయ్యడం సమంజసమైనది కాదు.

కేంద్ర ప్రభుత్వ ఉద్యోగస్తులందరికీ ఎక్కువ జీతాలు యిస్తున్నారని మంత్రి గారి వుపన్యాసంలోనే చెప్పారు. ఆ వుపన్యాసం విన్న తరువాత మన N. G. O. ల తరపున ఆ మంత్రిగారిని అక్కడకు వెళ్ళి సాక్ష్యము ఇమ్మంటే, కేంద్ర ప్రభుత్వం ఉద్యోగస్తుల జీతాలు తగ్గించండని చెప్పిఉండేవారని నాకు తోస్తున్నది.

*Dr. B. Gopala Reddy* : The hon. Member is right.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—కాబట్టి యిప్పటికైనా సరే ఈ అదనపు 6 రూ. లను Mufusil లో ఉన్నవారికి వర్తించేటట్లు చెయ్యాలని కోరుతున్నాను.

కోటి, రెండు కోట్ల రూపాయలు అప్పచేసి అయినా ఏకట్టడాలను మానేయకుండా colleges ను మూసి వెయకుండా మిగతావాటికి ఏ విధంగా allot చేస్తున్నారో ఆవిధంగానే ఈ N. G. O.'s కు కూడ allot చేసి వుద్యోగస్తులను తృప్తిపరచాలి.

అందరూ జీతాలు ఎక్కువచెయ్యాలని గోలపెట్టుతుంటే Local Boards ఉద్యోగస్తుల జీతాలను తగ్గించడానికి పూనుకున్నారు. ఆ గవర్నమెంటు ఆర్డరు సక్రమంగా లేదని ఇదివరకే చెప్పాము. దానిని ఈ House లో Table మీద పెట్టినప్పుడు మంత్రివర్గం పూర్తిగా examine చేసిందా అని అడుగుతున్నాను. చేసి ఉంటే ఇలాగ అయ్యేది కాదని నా అభిప్రాయము.

అధ్యక్షా, అన్నింటికంటే ముఖ్యమైన విషయము మంత్రిగారి వుపన్యాసముతో ఉండవలసినది, తెలుగులో మన వ్యవహారములు సాగించాలనేది. తమిళవారు శాశనసభలోను యితరవ్యవహారములలోన తమిళమును రాష్ట్ర భాషగా తీసుకోవాలని వారు ఏకగ్రీవంగా తీర్మానించారు. ఈ విషయమై ముఖ మంత్రిగారు ఇచ్చినసమాధానము ఏమిటి? శాసనములు అన్నీ తెలుగులోకి రావలెనని కోరుతున్నారు, అయితే తెలుగురాని సెక్రటరీలు,గుమాస్తాలు, ప్యూనులువున్నారు. వారిసందరినీ తీసివెయ్యమంటారా?అని అన్నారు. ఆలా ఎవరు అడిగినారు. వారు ఈసభలో ఉన్నట్టువారిపట్ల కొంచెంగౌరవముగా మాట్లాడితే బాగా ఉండునని నేను అభిప్రాయ పడుచున్నాను. ఇక్కడ ఆంధ్రేతరులు ప్రధానమైన స్థానాలలోవున్నారు. బడ్జెట్ మెమొరాండము తయారు చెయ్యడం చాలా కష్టమైన విషయము. ఇంగ్లీషులో అలవాటు పడినవారు తెలుగులో ఆర్థిక విషయాలు పద్దులు తయారుచేసి పెట్టారు. అది బాగా ఉన్నది ఎవరికీ వుద్యోగములు తీసివెయ్యనవసరములేదు. వారు తెలుగు నేర్చుకొనలేరా?

రెండు రాష్ట్రములు ఒకే రాష్ట్రముగా రూపొందడమువల్ల కొంతచిక్కు వచ్చింది. ఇంగ్లీషును త్వరలో తొలగించి తెలుగును అధికారభాషగా చేస్తే మంచిదని నేను విజ్ఞప్తి చేస్తున్నాను.

Regional Councils ఏర్పాటు చెయ్యాలని కేంద్ర ప్రభుత్వం సూచించింది. దానిని గురించి వల్లెత్తు మాట అయినా మాట్లాడుతారా అంటేలేదే. సూచన కూడా ఎక్కడాలేదు. దీనిని

ఏర్పాటు చెయ్యడానికి ప్రయత్నంచేస్తున్నామని గాని, గవర్నరుకు వ్రాసినామనికాని, ప్రెసిడెంటుకు వ్రాసినాము అని గాని చెప్పలేదే! ఇది అసంతృప్తికరముగా వున్నది.

భూమి సంస్కరణలు అంటే మన మంత్రివర్గానికి ముఖ్యంగా కాంగ్రెసుపార్టీకి వ్యతిరేకతగా ఉందని అందరికి తెలిసిన విషయము ఆవిషయమై ఆలోచన అయినాలేదే. ఈసమావేశము ముగిసేలోపున బిల్లు ప్రజాఅభిప్రాయానికి పంపుతానని కళావెంకటరావుగారు అంటున్నారు గాని, ఆర్థిక మంత్రిగారి ప్రసంగముచూస్తే ఒక్కమాటైనాలేదు,

*Dr. B. Gopala Reddy :* It has nothing to do with the Budget. Land reforms will not bring any money to the Government. Why should I mention it in the Budget speech.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— ప్రభుత్వంవారి policy గురించి చెప్పవచ్చునుకదా? Road Transport nationalisation విషయములో ఈ సంవత్సరము మనకు ఎక్కువ రాబోతుంది అన్నారుమంత్రిగారు. 190 లక్షల 95 వేలుఅనిబడ్జెటు ఎస్టిమేట్లలో వ్రాయబడింది. రివిన్యూఎస్టిమేట్ల క్రింద receipts from Passenger traffic 167 లక్షల 7 వేలు మాత్రమే ఉన్నది. ఎందువల్ల ఈతక్కువ వచ్చిందో. ఆలోచించవలెను. నేషనలైజేషను విషయములో పక్షపాతంలేకుండా అన్ని ప్రాంతాలకు చెయ్యాలి. ఒకపాలసీ ప్రకారము చెయ్యాలి ప్రజలసహకారము డ్రైవర్లు, కండక్టర్లసహకారంకావలెను. కొంతమందిని డ్రైవర్లనుతీసుకొనడము లేదని ముఖ్యమంత్రిగారు అంటున్నారు. బస్సులు surplus గా ఉన్నవని ఆర్థిక మంత్రిగారు చెప్పచున్నారు. తెలంగాణాలో బస్సులు రెట్టింపుచేసినా ప్రయాణికులు ఉంటారు. ప్రయాణికులు కండక్టర్ల దయాదాక్షిణ్యంమీద ఆధారపడవలసి వస్తున్నది. రేట్లు పెంచకుండా మనము చూడవలెను.

Administration లో కొన్నిముఖ్యమైన మార్పులు తీసుకు రావలసి యున్నది. పన్నులు అధికంచేయడంగురించి ఆలోచించడమువల్ల మాత్రంలాభంలేదు. వేసినపన్నులు సక్రమముగా వసూలగునట్లు చూడవలెను. దీనికి administrative changes ఏవి తీసుకురాదలచు కొన్నారో బ్రిటిషువారి బ్యూరాక్రసీనే కంటిన్యూచేస్తున్నారు. గాంధిగారు చెప్పినట్లు తెల్లబ్యూరాక్రసీ పోయి బ్రౌన్‌బ్యూరాక్రసీ రావడానికికాదు. మనము స్వరాజ్యం సంపాదించినది. జిల్లాబోర్డులు వద్దన్నారు. తిమ్మారెడ్డిగారు మార్కెటింగుకమిటీలకు నామినేషను చాలును అన్నారు. ఒక్క ఎసంబ్లీకిమాత్రం ఎన్నికలు ఉంటేచాలును అంటున్నారు. ప్రధానమైన మార్పులు చెయ్యవలెను. నాకు ఈఅవకాశము ఇచ్చినందులకు మీకు ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

*Mr. Speaker*: I shall give the hon Member Dr. Chenna Reddy fifteen minutes becausa he is an ex-Minister and can give some valuable sugges tions.

డాక్టర్ ఎమ్. చెన్నారెడ్డి (వికారాబాదు—జనరల్):—అధ్యక్షా, ఈసారి బడ్జెట్ గతసారి కన్నా ఆశాజనకమైన వాతావరణంలో సృష్టింపబడింది. అని ఆర్థికమంత్రిగారు చెప్పారు. అదినిజముకాదుఅనే

సంగతి చెప్పడానికి ఉద్దేశించినాను. నిజానికి అంకెలు వివరాలుచూస్తే ఈబడ్జెట్‌లో అనేకమైనలోపాలు కన్పిస్తున్నవి. ఆంధ్రలో ఆదాయం 38 కోట్ల 33 లక్షలు Estimate చేసివుంటే తెలంగాణాలో 25కోట్ల 32లక్షలు దీనికిఖర్చు. ఆంధ్రలో 40 కోట్ల 5లక్షలు, తెలంగాణాలో 22కోట్ల 9 లక్షల ఖర్చుపెడుతున్నారు. సర్ప్లస్ అనేది $2^1/_2$ కోట్లు తెలంగాణాలో ఉంటే ఆంధ్రలో 1—72లక్షలు బడ్జెటు వుంది. తెలంగాణా వెనుక బడిన ప్రాంతము. అక్కడ ఎక్కువఖర్చు చెయ్యడములేదు. తక్కువ ఖర్చు చెయ్యడము ఏవిధముగా సమర్థనీయమో నాకుఊహించడానికి వీలులేకుండావున్నది. ఇది లోటు బడ్జెటు కాదని చెప్పడంజరుగుతూ వుంది. నిజానికి కేవలము తెలంగాణా ప్రాంతమునకు అదనముగా ఖర్చుపెడితేన్యాయముగా ఉండేది. 25,27కోట్లు అయినా ఖర్చుపెడితే న్యాయముగా వుండేది. ఇందుకు నా విచారము కనబరుస్తున్నాను. ఎస్టిమేట్సు చూస్తే ఆంధ్రలో 34 కోట్ల బడ్జెటులో వుంటే 37 కోట్లు ఖర్చుచేసి. తెలంగాణాలో రూ 23 కోట్లు ఆదాయముంటే రూ. 20 కోట్లు ఖర్చు పెట్టడము ఏమిటని నేనుఅడుగుచున్నాను. ఇదివెనుకబడిన ప్రాంతము గుంటూరుజిల్లాలో ఉన్నన్ని హైస్కూళ్ళు మొత్తం తొమ్మిది తెలంగాణా జిల్లాలకు లేవుఅని వారు ఒప్పుకుంటున్న విషయమే. విద్యకు తెలంగాణా 5 కోట్ల 40 లక్షలు ఖర్చుపెట్టాలంటే 4 కోట్ల 40 లక్షల సుమారు 67లక్షలు ఎందుకు తక్కువఖర్చు పెట్టారు. అని నేను అడుగుచున్నాను ఇది సరైనపద్ధతికాదని అందరకు తెలుసును. ఆంధ్రలో 6—18 లక్షలు వుంటే 6—40 లక్షలు ఖర్చుచేశారు. దానికి నాకు ఏమీదుఃఖముగా లేదు. సంతోషముగానే వున్నది. కాని తెలంగాణా ప్రాంతములో ఖర్చుపెట్టలేదని ప్రభుత్వదృష్టికి తీసుకు వస్తున్నాను ఈవిషయాలన్నీ దృష్టిలో పెట్టుకొనే ఆనాడు తెలంగాణా రీజినలు కమిటీ వుండాలని అన్నారు, ఆనాడు మంత్రివర్గం వైఖరిచూస్తే ఏమీ అర్థంకాకుండావున్నది రూల్సు ఇంకా చెయ్యడములేదు. పంజాబులో పంజాబీ ప్రాంతము హిందీ ప్రాంతము వేరు వేరుగాని ఇక్కడ ఆవిధమైన కష్టం ఏమీ కేంద్ర ప్రభుత్వానికి లేదు రూల్సు చేసేదానికి 14 మాసాలు పట్టింది. ఫిబ్రవరి 1వ తేదీన గజెట్‌వస్తే ఇంకా ఏమీ చర్యతీసుకోలేదు. Notification లో rules ఉన్నవి. అది మెంబర్లకు పంచిపెట్టవలసిన భాద్యత ప్రభుత్వముమీదవున్నది ఎందుకు యింకా ఇవ్వలేదని నేను అడుగుచున్నాను. స్పీకరుగారి దృష్టికి ఈ విషయము తెస్తున్నాను నెలరోజులయినా యిప్పుడు ఏమితొందర ఏమి మునిగిపోయిందని అంటున్నారు కేంద్రమువారు సూచన చేశారు. దానిఅవసరంవున్నప్పుడు ఎందుకుఈకమిటీని కన్వీనుచెయ్యలేదు అని ఇదంతాభాద్యతతో కూడినదేనా ఇది అడుగుచున్నాను.

ఆంధ్రఅసెంబ్లీ రూల్సులో చాప్టర్ 18—ఎ కలుపుటకుగాను రీజినల్ కమిటీని form చేస్తూ ఇండియా గవర్నమెంటు చేసిన గజెట్ నోటిఫికేషన్‌లోనే వుంది. ఈ విషయం రివెన్యూ మంత్రిగారికి ఎందుకు తెలియదో నాకు ఆశ్చర్యముగా వుంది. రివెన్యూ మంత్రిగారు చాల సమర్థులు అనుభవజ్ఞులు. అనేక సంవత్సరాలుగా ఇటువంటి విషయాలలో వారికి అనుభవమున్నది. తెలంగాణా రీజినల్ కమిటీ అంటే ఎందుకులే అనే ఆలోచన తప్ప మరొకటి లేదని స్పష్టమౌతున్నది. ముఖ్యమంత్రిగారికి ఉత్తరము వ్రాసినాము. ఇప్పుడైనా మీరు యీ విషయమై శ్రద్ధ వహించి కమిటీ అధ్యక్షుని ఎన్నిక కొరకు తొందరగా సమావేశమయ్యేటట్లు చూడాలని మిమ్ములను ప్రార్థిస్తున్నాను ఛైర్ మన్ ఎన్నిక జరిగినప్పుడే యీ కమిటీ ఫంక్షన్ చేయడానికి వీలువుంటుంది. ఈ కమిటీ ఫంక్షన్ చేసినప్పుడే మన బిల్సు విషయంలోనే కాకుండ మిగత విషయాలపై కూడా రెజల్యూషన్ పంపించి తమ అభిప్రాయాలను ప్రకటించుకొనే

అవకాశము వాండ్లకు యివ్వాలని చెప్పి మీతో మనవి చేస్తున్నాను. ఉస్మానియా విశ్వవిద్యాలయమును గురించి కొందరు గౌరవ సభ్యులు మాట్లాడారు. ఆ నాడు విద్యాశాఖామంత్రి యీ విషయమై చెప్పతూ వుంటే వాతావరణము మరింత కలుషితమవుతుందని నేను ఏమి మాట్లాడలేదు. నేను తెలంగాణాసభ్యులను కన్సల్ట్ చేసినానని అన్నారు. నేను ఏ బర్మాగుంచో ఏ రంగూన్‌నుంచో సభ్యునిగా రాలేదు. తూర్పు గోదావరినుంచికూడా నేను సభ్యునిగా ఎన్నుకోబడలేదు. నాకు తెలిసినంత వరకు అనేక మంది తెలంగాణా సభ్యులున్నారు. వారిని సంప్రదించి చేశామని చెప్పడము ఇంక ఎక్కడైనా పార్టీ మీటింగులో కాని గ్రూప్ మీటింగులోకాని చెప్పితే సరిపోతుందికాని ఆ నాడు విద్యాశాఖ మంత్రిగారు అసెంబ్లీలో చెప్పిన దానిని తీవ్రంగా ఖండిస్తున్నాను. ఇది సరియైన పద్ధతి కాదని మనవి చేస్తున్నాను. డి. యస్. రెడ్డి గారిపై ఎవరికిఅభిమానము లేదనికాని గౌరవం లేదని కాని కాదు. ఎందుకు వారిని వెంకటేశ్వర యూనివర్‌సిటీ నుంచి మరలింపు చేశారో తెలంగాణా ప్రజలకు— ఏ పార్టీకి చెందినవారైనా సరే అడగడానికి అధికారముంది. హోమ్‌మినిస్టర్ ఏ విధంగా హామీ యిచ్చారో నాకు తెలియదు. ఆ హామి ఏవిధంగా వుందో నాకు తెలియదు. కమిటీ పెట్టారు. కమిటీలో ఏమి జరుగుతుందో నేను వింటున్నాను. అసెంబ్లీలో సెషన్స్‌లో వచ్చే అకాడమిక్ సంవత్సరమైన తర్వాత వైస్ ఛాన్సలర్‌షిప్‌కు ఎన్నికలు జరుపుదామని చెప్పారు. అది జరుగుతుందని మంత్రిగారికి నమ్మకముందో లేదో నాకు తెలియదు కాని నాకు మాత్రము లేదు. వరంగల్లులో ఇంజనీరింగ్ కాలేజి పెట్టడము రీజియన్ సమస్య అనుకుంటే పొరపాటు. కేంద్ర ప్రభుత్వము వారు సదరన్ రీజియన్‌లో టెక్నికల్ కమిటీని 1956 వ సంవత్సరంలో నిర్ణయము చేసినారు. ఆ కమిటీలో గోపాల్‌రావు ఎక్బోటేగారు సభ్యులుగా వున్నారు. ఈ ఇంజనీరింగు కాలేజి విషయమై ఆ కమిటీలో తీర్మానము చేయబడినది. పింగళి వెంకటరామా రెడ్డిగారు ఒక భవనము ఇచ్చారు. ఆ భవనము సరిపోతుందో లేదో నాకు తెలియదు. పై వివరముల బట్టి ఇంజనీరింగు కాలేజిని వరంగలులో పెట్టడము ప్రభుత్వ ప్రధాన కర్తవ్యమని నేను మనవి చేస్తున్నాను. ఈ అసెంబ్లీలో వున్న అన్ని పార్టీలవారు అన్ని ప్రాంతాలవారు ఆంధ్ర తెలంగాణా సభ్యులు సుమారు 120 మంది ఇచ్చిన అర్జీకూడా నేను చూచాను. అది ముఖ్యమంత్రిగారికి సమర్పింప బడుతుంది. కాబట్టి వరంగల్‌లో తప్పకుండా ఇంజనీరింగ్ కాలేజిపెట్టాలి. తెలంగాణాలో పెట్టాలని తీర్మానము తీసుకున్నాము క్రనుకవరంగల్‌లో యీ ఇంజనీరింగ్ కాలేజిపెట్టాలని నేను మనవిచేస్తున్నాను. ఒకసారి తీర్మానమైన విషయాన్ని మీరు ఆచరణలో పెట్టకుండా మార్చడానికి పూనుకుంటారనే నా ఆందోళన ప్రకటిస్తున్నాను తెలంగాణా విలేజి ఆఫీసర్లుకాని, ఆంధ్ర విలేజి ఆఫీసర్లుకాని, వారసత్వంగా వచ్చే పద్ధతి వుండకూడదు అని అనుకొనే వాండ్లలో నేను ఒకడిని. తెలంగాణాలోని పటేల్ పట్వారీలకు, ఆంధ్రలో వుండే మున్‌సిఫ్ కరణాలకు తగిన వేతనాలు యివ్వడము ధర్మమని భావించాలి. ఆంధ్రలో ఏదో కొంత యిచ్చారని దానితో తృప్తి పడడానికి ఆస్కారము లేదు. తెలంగాణా విషయం తర్వాత ఆలోచిస్తామని రివెన్యూ మంత్రిగారు ఆనాడు చెప్పారు. కాని ఇప్పుడు మళ్లీ యీ విషయమై తొందరగా ప్రయత్నము చేయాలని చెప్పి నేను మనవి చేస్తున్నాను. స్టేట్సు ఇంటిగ్రేషన్ అయిన తర్వాత అధికారుల గురించి—ఆంధ్రలో వుండే అధికారుల గ్రేడ్లను తెలంగాణా అధికారుల గ్రేడ్లను సమన్వయము చేయాలని అనుకున్నామని నాకు జ్ఞాపకము వుంది. పే అండ్ సర్వీసస్ కమిషన్ వేయాలనుకున్నాము. 15 మాసములు జరిగి పోయింది. కాని యీ విషయమై ఏమిచేయలేదు. ఆంధ్రలో చిన్న ఉద్యోగస్థుల జీతాల గ్రేడ్లు చాలా తక్కువగా వున్నవి. తాలూకా అగ్రికల్చరల్ ఆఫీసర్‌కు తెలంగాణాలో 175 రూపాయలు వుంటే ఆంధ్రలో 100 రూపా

యలు వున్నవి హైదరాబాదు గవర్నమెంటు, ఎక్కువ జీతాలవారికి తక్కువ జీతాలవారికి ఉన్న తేడాను తగ్గించడానికి ప్రయత్నము చేసినదని నేను మనవి చేస్తున్నాను. ఆంధ్రలోని అగ్రికల్చరల్ గ్రాడ్యుయేట్సుకు చాల తక్కువ జీతాలిస్తూ, మంత్రి తిమ్మారెడ్డిగారు రైతులకు న్యాయము కావాలంటే కష్టాలు పట్టుకొని రండయ్యా అని అంటారు. అగ్రికల్చరల్ ప్రొడక్షన్ ఎక్కువ కావాలంటారు. అగ్రికల్చరల్ గ్రాడ్యుయేట్సుకు యిచ్చే జీతము యీ నాడు వెటర్నరీ, మెడికల్ గ్రాడ్యుయేట్సుకు యిచ్చే జీతముకంటే తక్కువగా ఉన్నాయి. వారికి సరియైన గ్రేడ్లు యివ్వలేదు. వారిని గురించి సరియైన పద్ధతిలో వ్యవహరించలేదు. కాబట్టి పే అండ్ సర్వీసెస్ కమిటీ దానిని పెట్టి, సర్వీసెస్‌లోని వివరాలన్ని విచారణ చేసి టెక్నికల్ గ్రాడ్యుయేట్సుకు అందరికి సమానంగా జీతాలు యిచ్చేటట్లు చూడాలి. అగ్రికల్చరల్ గ్రాడ్యుయేట్లకు అదనంగా యిచ్చేటట్లు చూడాలి. అగ్రికల్చరల్ చదువు రైతు యువకులు చదువుకొనడానికి ఉత్సాహము కలుగజేసేదిగా వుండాలి. ఈ విషయంకూడా ప్రభుత్వంవారిదృష్టికి తేబడినది. రెండవ పంచవర్ష ప్రణాళిక, రెండవ స్పుట్‌నిక్ అంత తీవ్రముగా పోయేటటువంటిది. పాతపడి బూజుపట్టిన ప్రభుత్వ యంత్రాన్ని మార్చాలి. ఈ ఆఫీసర్సుకు బదులు డివిషనల్ కమీషనర్సును పెట్టాలి. వాండ్లకు హైదరాబాదులో వుండే సౌకర్యాలు లేక పోవచ్చును.పరిపాలనా వ్యవస్థలో మార్పులు రావాలి. అడ్మినిస్ట్రేషనులో వున్న పాతపద్ధతులు బద్దలుగొట్టి అభివృద్ధికరమయిన వ్యవస్థను ఏర్పాటు చేస్తేనేగాని రెండవ పంచవర్ష ప్రణాళిక జయప్రదం కాదు. పరిపాలనా పద్ధతులను పరిష్టం చేయడానికి బ్రహ్మానందరెడ్డిగారి ఎకానమీ కమిటీ విశేష కృషి చేస్తున్నట్లు కనపడడం లేదు. ఆ కమిటీ అడ్మినిస్ట్రేషనును బాగ చేస్తుందని ఆ కమిటీ సభ్యులకు కూడ లేదని నాకు తోస్తున్నది. అడ్మినిస్ట్రేషనులో తొందరగా మార్పు రావాలి. ఇతర రాష్ట్రములో ఎన్నో విధముల పోటి చేయదలచుకున్న మనం పరిపాలనా వ్యవస్థలోకూడ అభివృద్ధి కరమయిన మార్పులు తీసుకొని రావడానికి కృషి సలుపవలసున్నది. ఇందుకు మేము సంపూర్ణంగా సహకరిస్తాము ప్రభుత్వోద్యోగులు కూడ సహకారం చేస్తారనుకుంటున్నాను. ఈ అధికారుల దేశ భక్తిపై నాకే విధమయిన అనుమానము లేదని మనవి చేస్తున్నాను.

ఇంటిగ్రేషన్ ఆఫ్ లాస్ విషయంలో చాల తొందర తొందరగా పన్నులు జరుగుతున్నాయి. పాయంత్రం బిల్లు తీసుకొని వచ్చి మరుచటి ఉదయం దానిని పాస్ చేయించుకొనడమనేది మంచిది కాదు. ఉభయ ప్రాంతములలోని శాసనములను ఇంటిగ్రేట్ చేయవలసి వచ్చినప్పుడు అన్ని విషయములను సమగ్రంగా పరిశీలించడం అత్యవసరం. ఇందుకు ఒక కమిటీని వేయాలి. ఈ కమిటీలో శాసన సభ్యులు ఇతరత్రా ఉన్న పెద్దలూకూడ ఉండాలి. లాండు రివెన్యూ ఎక్కువ చేయాలంటె ఒక కమిటీని వేస్తున్నాం. మోటారు టాక్సు కావాలంటే ప్రత్యేకంగా ఒక బిల్లును తెస్తున్నాం. ఈ విధముగా విడివిడిగా శాసనాలు చేసేకన్నా వీటన్నింటిని సమన్వయ పరచడానికి ఒక చక్కటి కమిటీని ఏర్పాటు చేయాలి. ఆ కమిటీవారి సిఫారసుల ననుసరించి చట్టాలను పాస్ చేయాలి.

తెలంగాణాకు, అన్యాయం జరుగుతున్నదని ఒకడు దుఃఖిస్తుంటే ఆంధ్రకు మేలు జరుగవలసింది జరగడం లేదని ఇంకొకడు విచారించడం మంచిది కాదు. ఏ ప్రాంతం వారికి అన్యాయం జరుగకుండా చూడవలసిన విధి ప్రభుత్వం మీద ఉంది.

గోదావరి జలాలను, తమ ఇష్టం వచ్చినట్లుగా వాడుకోడానికి ఏవో సంప్రదింపులు జరుగుతున్నట్లు అప్పుడప్పుడు వింటుంటాము మద్రాసు ముఖ్యమంత్రిగారికి మన ముఖ్యమంత్రిగారికి ఎన్నో హామీలిచ్చినట్లుగా మనం పత్రికలలో చదువుతుంటాము గోదావరి, జలాలు ఉపయోగించడంలోగాని తిరుత్తని సరిహద్దు విషయాలలోగాని యీ ఉభయరాష్ట్ర ముఖ్యమంత్రులు పరస్పరం సంప్రదించుకుని వ్యక్తిగత సంబంధ బాంధవ్యాలను ఆధారం చేసుకుని నిర్ణయాలు తీసుకొనడం మంచిదికాదు. పోచంపాడు, ఇచ్చంపల్లి, మొదలైన ప్రాజెక్టులకు తగినంత నీరు గోదావరిలో ఉన్నదా లేదా అనే విషయాలు ఆలోచించుకోవాలి తెలంగాణా పురోభివృద్ధికి ఈ ప్రాజెక్టులు ఎంతో అవసరం. ఆంధ్ర ప్రదేశ్‌లోని రైతాంగం యొక్క అవసరాలను తీర్చిన తరువాత అదనంగా ఉండే నీటిని ఇతర రాష్ట్రాలకివ్వడంలో తప్పేమీ లేదు. ఇతర రాష్ట్రాలకు నీరు ఇవ్వకూడదనే సంకుచితత్వం నాకేమీ లేదు. ఐతే మన రాష్ట్రంలో ఉన్న రైతాంగం యొక్క అవసరాలేమో మనం గుర్తించుకోవాలి. మైసూరు ముఖ్యమంత్రితో మనకు మంచి సంబంధ బాంధవ్యాలు ఉన్నవని పత్రికలలో చదువుతుంటాము. కాని రాజోలి బండకు సంబంధించిన 7 గ్రామాల విషయంలో మైసూరు ప్రభుత్వం సహకారం చేయకుండా బాధ పెడుతున్నారని ఇరిగేషను మంత్రిగారు 4 రోజుల క్రిందట ఒక ప్రకటన చేసినట్లున్నారు. తెలిసి చేశారో, తెలియక చేశారో, నాకు తెలియదు. రాజోలిబండ ప్రాజెక్టు పని మాత్రం సక్రమంగా జరుగడం లేదు. ఆ నాడు హైద్రాబాదు ప్రభుత్వంవారు విలీనీకరణ సమయంలో ఆ 7 గ్రామాల గురించి తీర్మానం చేశారుకూడ. ఆ 7 గ్రామాల విషయం పరిశీలించి రాజోలిబండ పనులకు ఆటంకాలు లేకుండా చేయమని మేము ఆలోచన చెప్పాము.

గనులను, త్రవ్వే విషయంలోకూడ మన ప్రాంత పారిశ్రామికులకు నష్టం రాని విధంగా మన విధానాన్ని రూపొందించుకోవాలి బొంబాయి కలకత్తా ప్రాంతాలలోని ఎక్స్‌పోర్టర్సుకు గనులు అప్పగించవలెనా, లేదా ముడి ఖనిజాలను పైకి తెచ్చే మన ప్రాంతాలలోని మైనర్సును ప్రోత్సహించవలెనా ఆలోచించాలి. బొంబాయి, కలకత్తా ప్రాంతాలనుంచి వచ్చే ఎక్స్‌పోర్టర్సు కోటీశ్వరులు. మన ప్రాంతంలోని వారు శ్రమించి ఖనిజాలను బైటకు తీసేవారు. ఎవరికి ప్రోత్సాహమీయాలి అనే విషయం, ప్రభుత్వం ఆలోచించాలి. మన ప్రాంతాలలోని వారికి లాభం కలిగేటట్లు చూడాలి.

స్థానిక పరిపాలన విషయంలో మంత్రిగారికి ఇష్టములేకనో మరెందు చేతనోగాని ఎక్కడ చూస్తే అక్కడ స్థానిక సంస్థలను సూపర్‌సీడ్ చేస్తారేమోనను భయమున్నది. ఇది ఆరోగ్యకరమయిన ధోరణి కాదని మనవి చేస్తున్నాను. అది నిజమా కాదా అని చెప్పడానికి ఇది సమయంకాదు. అటువంటి వాతావరణముండడం మంచిదికాదు. ఒంగోలు మునిసిపాలిటీని సూపర్‌సీడ్ చేస్తారని మానములనుండి వింటున్నాం. లోపములున్నట్లయితే ఏ స్థానిక సంస్థలనయినా సూపర్‌సీడ్ చేయవచ్చు. కాని తడవతడవకు బెదిరించడం మంచిది కాదు, న్యాయం కాదు. ఇటువంటి ధోరణివల్ల అడ్మినిస్ట్రేషనుకు దెబ్బ తగులుతుంది. పార్టీకి కూడ దెబ్బ తగులుతుంది. ఇంకా ఎన్నో విషయముల గురించి చెప్పవలసి ఉందిగాని తమ ఆజ్ఞను ధిక్కరించడానికి నేను సాహసించలేను. రాజకీయ బాధితులకు భూముల నిచ్చే విషయంలో నిష్పక్ష పాతంగా నిర్ణయాలు జరగాలి. శాసన సభ్యులకు కానివ్వండి, ఇతర ప్రముఖులకు కానివ్వండి, ఎవరికి భూములు ఇచ్చినప్పటికి చాల జాగ్రత్తగా పరిశీలన చేస్తే తప్ప లేకపోతే ప్రజలు దుమ్మెత్తి పోస్తారనే సంగతి మనం మరచి పోకూడదని మనవి చేస్తున్నాను. రాజకీయ బాధితుడంటే ఏ పార్టీకి చెందినవాడైనప్పటికి ప్రజల్లో గౌరవ ముండేటట్లుగా చూడాలి. రాజకీయ బాధితులను సమాజం చిన్న చూపు

తో చూచినట్లయితే ఆనాడు దేశంలో ప్రజాస్వామ్యం దెబ్బతింటుంది. డెమొక్రసీకి ప్రమాదముంటుంది. కాబట్టి రాజకీయ కార్యకర్తలకు గౌరవప్రతిష్టలు ఉండేటట్లుగా మనం వ్యవహారాలు జరపాలి. ఈ విషయములను మనవిచేస్తూ సెలవు తీసుకుంటున్నాను నాకీ అవకాశమిచ్చినందులకు తమకు కృతజ్ఞత తెలుపుకుంటున్నాను.

శ్రీ కె సుదర్శనరావు (పాల్వంచ).—ఆర్థిక మంత్రిగారు మిగులు బడ్జెటును ప్రతిపాదించుట సంతోషింపవలసినవిషయం . ఐతే దీనిలో కొన్ని సమస్యలున్నవి. వాటిని పరిష్కరించుకొనుటకు మనం ప్రయత్నం చేయాలి. అప్పుడు ఇంకా ఎక్కువ మిగులు బడ్జెటును తయారు చేయుటకవకాశ మేర్పడుతుంది యీ బడ్జెటును పరిశీలిస్తేకొన్ని విషయములలో సక్రమంగా ఖర్చులు చేయలేదేమోననిపిస్తుంది. గత సంవత్సరం కేటాయించిన మొత్తములు సరిగా ఖర్చు చేయబడలేదు. విద్య, ఇరిగేషనువంటి ముఖ్య పద్దుల క్రింద డబ్బు మిగిలిపోయింది. ఒక వైపున ప్రజలకు విద్యా సౌకర్యాలు సక్రమంగా లేవని బాధ పడుతూకూడ ఈ విధంగా కేటాయించిన మొత్తాలను ఖర్చు చేయక పోవడం సరయిన పద్ధతికాదు. ఈ విధంగా విద్యాభివృద్ధికి ఆటంకం కలిగించుటకు బాధ్యులెవరో ఆ అధికారులెవరో గమనించి చర్య తీసుకోవాలి. తెలంగాణా ప్రజల సైకాలజీని అర్థంచేసుకోవాలి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత తెలంగాణా, ఆంధ్ర అనే వివక్షత క్రమక్రమంగా మాసిపోవాలి. అందరం తెలుగువారమే అనేభావన ప్రజ లందరిలో ఏర్పడాలి. ఐతే గత 14 మాసముల సహచర్య తోటే యీ భావన బల పడదు. ఇందుకు తగిన వాతావరణం క్రమేణ ఏర్పడాలి. ఆ వాతావరణాన్ని సృష్టించుటకు మనం కృషి చేయాలి. ఐతే ఒక రోజున తెల్లవారేసరికి యీ భావన వస్తుందనేకోవడం పొరపాటు. తెలంగాణా ప్రాంతంలోని ప్రజల మనస్తత్వాన్ని అర్థంచేసుకోడానికి ప్రయత్నించవలసి ఉంది. తెలంగాణా ప్రజలలో ఎట్టి భయాలు ఉన్నవో తెలుసుకోవాలి వాటిని తొలగించడానికి ఎక్కువ ప్రాధాన్యత ఇయ్యాలి. తెలంగాణా ప్రాంతములో విద్యావైద్య సౌకర్యాలకు తదితర అభివృద్ధి కార్యక్రమాలకు కేటాయించబడిన డబ్బును సరిగా ఖర్చుచేయాలి. ఆ విధంగా ఖర్చు చేయకుండా డబ్బు మిగుల్చుట భయాందోళనలకు కారణమవుతుంది. వెనుక బడిన ప్రాంతాలను అభివృద్ధి పరచడానికి హెచ్చుకృషిచేయాలి. వెనుక బడిన ప్రాంతాలు తెలంగాణాలో ఉండవచ్చు. ఆంధ్రలో ఉండ వచ్చు, రాయల సీమ ప్రాంతంలో ఉండవచ్చు, ఆదిలాబాదు, పాల్వంచ, బూరుగంపాడు మొదలైన వెనుక బడిన ప్రాంతాలెన్నో తెలంగాణాలో ఉన్నాయి. బడ్జెటులో ఖర్చుకాకుండా మిగిలి పోయిన సొమ్మును వెనుక బడిన ప్రాంతాలలో ఖర్చు పెట్టినట్లయితే అక్కడ అభివృద్ధికి దోహదకారవుతుంది. ప్లానింగుకు సంబంధించిన కార్యక్రమముల విషయంలో నగంకంట్రిబ్యూషను ఏ ప్రాంతాలవారిస్తారో అక్కడే పనుల్ని జరుగుటకు ఎక్కువ అవకాశంకనిపిస్తుంది. వెనుకబడిన ప్రాంతాలు ఎక్కువగా కాంట్రిబ్యూషను చెల్లించ లేవు కనుక అక్కడ అభివృద్ధి పథకాలు తీసుకోవడం ఆలస్యంఅవుతుంది. ఏ ప్రాంతముల నుంచి కంట్రిబ్యూషనురాదో ఆ ప్రాంతములో అభివృద్ధి పథకాలు తీసుకోజాలక పోవడంవల్ల వెనుక బడిన ప్రాంతాల్ని అభివృద్ధి చెందడం కష్టమవుతుంది. వెనుక బడ్డ ప్రాంతాలు వెనుక బడ్డట్టుగానే ఉంటవి. అభివృద్ధి చెందిన ప్రాంతాలు ముందుకువచ్చి కంట్రిబ్యూషనిచ్చి స్కీమ్ను అమలుచేయించుకోడానికి వీలుంటుంది. ఈ పద్ధతివల్ల వెనుకబడిన వారని ఇంకావెనుకకు నెట్టి ముందుకుపోయేవారికి ఎక్కువ ప్రోత్సాహమివ్వడమవుతుంది.

కాబట్టి దీనిని పునరాలోచన చేయాలి. కోయప్రాంతాల ప్రజలు , ఏజన్సీప్రాంతాల ప్రజలు,

కంట్రిబ్యూషన్సు యివ్వాలంటే ఎక్కడనుంచి తెచ్చి యివ్వగలరు ? ప్రభుత్వం 2, 3, లక్షలు ఖర్చు పెట్ట దలచుకుంటే మూడవ వంతు అక్కడి ప్రజలు కంట్రిబ్యూషను యివ్వాలంటే , అది అసాధ్యం. లేక, మధ్య మధ్య శ్రమదానం చేస్తే సరిపోతుంది, డబ్బు అక్కర లేదంటే, అదికూడా కష్టమే. ఎందువల్లనంటే వారికి పూటకు తిండిలేదు . కష్టపడి పనిచేస్తేనేగాని తిండిదొరుకదు నా నియోజకవర్గం పాల్వంచ కోయబున్నారు. వారు త్రాగే నీరుకూడ అయిదారుమైళ్ల దూరములో ఉన్న వాగులనుంచి తెచ్చుకోవాలి అయిదు మైళ్ల లోపు బావులు లేని పల్లెలున్నాయి. అటువంటి పరిస్థితులలో బ్రతుకుతున్నవారిని శ్రమదానం చేయమంటే చేయలేరు. కాబట్టి ప్రభుత్వం యీ విధానం అవలంబిస్తే వెనుక పడ్డప్రాంతాలు అభివృద్ధి కాజాలవు. అభివృద్ధి చెందిన ప్రాంతాలే , యింకా ఎక్కువ ముందుకు పోవటానికి వీలవుతుంది.

తరువాత యీ వెనుకబడిన ప్రాంతాలలో రోడ్డు సరిగాలేవు. ఖమ్మంనుంచి కొత్తగూడెం పోయేరోడ్డు చాలా అధ్వాన్నస్థితిలో ఉన్నది. అక్కడ మంత్రులు పర్యటన చేసే ఉంటారు. ఆ రోడ్డు మీద ప్రయాణం చాలాకష్టం. ఒక spare wheel పెట్టుకొని ప్రయాణం మధ్యలో ఉప యోగించవలసిన పరిస్థితి ఉన్నది. కొత్తగూడెంలో బొగ్గు ఉత్పత్తి ఎక్కువయినది. అందువల్ల traffic కూడా ఎక్కువయినది.అటువంటి back ward areas లోని రోడ్ల విషయమై ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధ వహించాలి అక్కడ ఉన్న ఇంజనీర్లు కూడా ఈ విషయాన్ని అంగీకరిస్తున్నారు. ప్రభుత్వానికి ప్రపో జల్సు కూడా పంపారు. ఆ రోడ్లను బాగు చేయించుటకు ప్రభుత్వం వెంటనే చర్య తీసుకోవాలి. వెనుకపడిన ప్రాంతాలలోరోడ్డు వేసి సౌకర్యాలు కలిగించకపోతే అక్కడిప్రజలు , అభివృద్ధి చెందిన నాగరికత ప్రాంతాలతో సంబంధం లేకుండా ఉండిపోతారు.

పెద్ద పెద్ద ప్రాజెక్టులకొరకు కోట్లకొలది ధనము వ్యయముచేస్తున్నాము. అవి అన్నీ long term plans. వాటి వల్ల ఏ పది, పదిహేను సంవత్సరాల తరువాతనో గొప్పగా లాభం ఉంటుందని చెప్పవచ్చు. అంతవరకు ఈ ప్రజలు ఇబ్బందులకు గురి అవుతూ ఉండలేరు. అందువలన short term plans కూడా తీసుకోవాలి మైనరు ఇరిగేషన్ వసతుల విషయమై శ్రద్ధ తీసుకోవాలి. వందల కొలది సంఖ్యలో చిన్న చిన్న కుంటలు, చెరువులు తెగిపోయి ఉన్నవి. 40, 50, 100 ఎకరాల అయకట్టు ఉన్న చెరువులు ఎన్నో వున్నాయి. అవన్నీ బాగు చేయిస్తే తక్కువ డబ్బుతో ఎక్కువ మంది ప్రజలను సంతృప్తి పరచ గలుగుతారు. అక్కడ ఇంజనీర్లు ఆ ప్రాంతాలలో, ప్రజా ఉద్య మాలలో పనిచేసే కార్యకర్తల సహాయంతో వివరాలు సేకరించి ప్రభుత్వం శ్రద్ధ వహించి నీటి వసరుల సదుపాయం కలుగ జేస్తే వెనుకపడిన ప్రాంతాలలోని ప్రజలకు ఎంతో సహాయపడిన వారవుతారు. పెద్ద పెద్ద ప్రాజెక్టులు నాగార్జునసాగర్ మొదలయినవి కడుతున్నామని 1970 వచ్చే వరకు నీరు సప్లై చేస్తా మని , పంటలు లభివృద్ధి చేస్తామని, గ్రామ గ్రామానికి విద్యుచ్ఛక్తి సప్లై చేస్తామని,సుఖ సౌఖ్యాలు కల్గ బోతాయని చెప్పినంత మాత్రాన ప్రజలు సంతృప్తిపడలేరు. ఈలోగా వాళ్లకున్న చిన్న, చిన్న చెరువులు, గుంటలు బాగు చేయించి నీటి వసతులు కలుగజేస్తే వాళ్ల జీవనాధారానికి పంటలు పండించుకొనుటకు వీలవుతుంది. కాబట్టి ఈ వెనుక పడిన ప్రాంతాలు తెలంగాణాలోఉన్నా, సర్కార్సులో ఉన్నా, రాయలసీమలో ఉన్నా, ఎక్కడ ఉన్నా ఎక్కువ సౌకర్యములు కలుగచేయటానికి ప్రభుత్వం వెంటనే పూనుకోవాలి.

పాల్వంచ ఏరియాలో వైద్య సౌకర్యాలు లేవు మసూచికము మొదలయిన జబ్బులువస్తే కొత్త గూడెంగాని, ఖమ్మంగాని డాక్టరుకు కబురువెళ్లేటప్పటికి చాలా టైము పడుతున్నది. పార్టీలు గ్రామాలకు పోయి రోగులకు ఇంజెక్షన్సు యివ్వటానికిగాని, టీకాలు వేయటానికిగాని అవస్థవుతోంది. పోయిన పార్టీలుఅన్ని గ్రామాలకు వెళ్లి precautionary measures తీసుకొనుటకు వీలులేకుండా. ఉన్నది. రోడ్ల ప్రక్కన ఉన్న గ్రామాలకు వెళ్తారు. లోపలగాఉన్న ప్రాంతాలకు వెళ్లరు. ఉద్యోగస్తులకు కష్టముగాఉన్నది. బండ్లువెళ్లవు. పనులు జరుగుటలేదు. ప్రజలు వ్యాధులకు గురిఅవుతున్నారు. ముఖ్యంగా , రోడ్లు వేయించాలి, వైద్య సౌకర్యములు కలిగించాలి. వైద్యాధికారులకు సక్రమంగా సౌకర్యాలు కలిగిస్తే వెనుక బడిన ప్రాంతాలలో జబ్బులు వచ్చినప్పుడు వీరు అందుబాటులో ఉంటారు. బడ్జెటులో వైద్యమునకు డబ్బు కేటాయిస్తున్నారు. మందులు ఉన్నాయి డాక్టర్స్ ఉన్నారు. కాని సమయానికి పోలేక పోవుట మూలంగా ప్రజలకు లాభం కలుగుటలేదు. కాబట్టి ఆంధ్రప్రదేశ్ మొత్తంమీద వెనుక పడిన ప్రాంతాలు ఎక్కడ ఉన్నప్పటికీ, వాటిని అభివృద్ధి చెందిన ప్రాంతాలతో సమానంగా తీసుకు రావాలని కోరు తున్నాను.

తరువాత పరిశ్రమల విషయంలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వానికి నూటికి 50 వంతులపైన షేర్సు ఉన్న Industries ఉన్నవి. పరిశ్రమలలో—Board of Directors లో అంటే కంపెనీ యజమానులతో బాటు కార్మికుల ప్రతినిధులకు కూడా ప్రాతినిధ్యం ఇస్తామని అనేక సార్లు కేంద్రప్రభుత్వ కార్మికశాఖా మంత్రి, Commerce and Industries మంత్రికూడా చెప్పియున్నారు. ఇక్కడ పరిశ్రమలలో మన ప్రభుత్వమునకు భాగస్వామ్యము ఉన్నది. కాబట్టి పరిశ్రమల యాజమాన్యం లో కార్మికులకు కూడా ప్రాతినిధ్యం యిచ్చే విషయమై పరిశీలించాలని కోరుతున్నాను. ఆ విధముగా నూటికి 50 వంతులకు పైన ప్రభుత్వమునకు shares ఉన్న పరిశ్రమలలో ముందుగా, కార్మికులకు management లో ప్రాతినిధ్యం యిచ్చి వారిలో confidence కలిగించి, ఉత్పత్తిని ఎక్కువ చేయాలి. ఈ నాడు పరిశ్రమలలో యజమానుల, కార్మికుల మధ్య నున్న rift, ఆ పద్ధతిని అమలు పెట్టి తగ్గించాలి. అన్ని ఫ్యాక్టరీలలోను యూనియన్సు ప్రతినిధులను ఒప్పించి కూర్చోపెట్టమని చెప్పటలేదు. ఎక్కువ shares ఉండి ప్రభుత్వ అజమాయిషీలో ఉన్న ఫ్యాక్టరీస్‌లో conciliatory measures అవలంబించి మేనేజిమెంటులో సంప్రతించి కార్మిక ప్రతినిధులను మేనేజిమెంటులోకి తీసుకోవాలి.

. పరిశ్రమలలో ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక స్థానము ఉన్నది. దక్షిణ భారత దేశంలో కల్లా పెద్ద బొగ్గు గనులు ఇక్కడ ఉన్నవి. పంచదార ఫ్యాక్టరీలు ఉన్నవి. పేపరు మిల్సు ఉన్నవి, బట్టలమిల్సు ఉన్నవి. 5 వేలనుంచి 20 వేలవరకు అంతకంటే ఎక్కువ మంది కార్మికులతో పనిచేసే ఫ్యాక్టరీలు ఉన్నవి. కాబట్టి కార్మికులలో అసంతృప్తి పెరగ నివ్వకూడదు. Management లో కూడ వారికి voice ఉన్నదనే భావము కలిగించాలని, confidence ను create చేయాలని కోరుతున్నాను.

శ్రీ గోపిడి గంగారెడ్డి:—అధ్యక్షా, కొత్త సంవత్సరంలో రాజ్యం నడపటము కొరకై లెక్కలు చూపించే బడ్జెటు మీద ఇవాళ చర్చ జరుగుతున్నది. ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తర్వాత ఇది రెండవ బడ్జెటు. రెంటకు పూర్వము లోటు బడ్జెటు ఉండేది. ఇప్పుడు మిగులు బడ్జెటు అయినది. ఇప్పుడు ప్రభుత్వం వారు పనులు చేయకుండా, డబ్బు మిగల్చటం జరిగింది. వారికి పనులు చేయటం చేతగాక డబ్బు మిగిలిస్తున్నారు.

దీనివల్ల ప్రభుత్వ ఉద్యోగస్తులు పూర్వంకన్నా చాలా బలహీనులైనారని తెలుస్తున్నది. మిగులు బడ్జెటు చూపించటానికి కారణం ఏమిటి ? ప్రభుత్వం వారు పనులు చేయకపోవటం వల్ల, దేశాన్ని అభివృద్ధి పరచక పోవటం వల్ల మిగులు బడ్జెటు ఏర్పడుతున్నది అన్నమాట. ప్రభుత్వం ఎంతపని చేస్తే దేశం అంత బాగు పడుతుంది. మేము పని చేయటం లేదు, మేము పైసలు మిగుల్చు కొంటున్నాము. ఇన్ని పైసలు మిగిలినాయి. అని చెప్పటం సరైనది కాదు. ఇందువల్ల దేశానికి మేలు కలుగుతుందని నేను అనుకోవటం లేదు.

నేను పల్లెటూళ్లలో చూస్తూ ఉంటాను. అక్కడకు ఒకడు గారడిఆట చేయటానికి వస్తాడు. ఆ చేతిలోని వస్తువు మాయంచేసి, యీ చేతిలోకి తెప్పించటం, యీ చేతిలోది మాయంచేసి ఆచేతిలోకి తెప్పించటం, వస్తువులన్నీ మాయం చేసి, తిరిగి తెప్పించటం యీ విధమైన గారడి ఆట ఆడిస్తాడు. అదే విధంగా ఇక్కడ లెక్కలు చూపించటం జరుగుతున్నది "ఛూ మంతర్" అని గారడిలెక్కలు చూపించటం జరుగుతున్నది.

తెలంగాణాలో వచ్చిన డబ్బు అంతా ఖర్చుపెట్టక, కొంత మిగులు చూపిస్తున్నారు. తెలంగాణాలో వచ్చిన డబ్బు ఖర్చు పెట్టక పోవటానికి కారణం ఏమిటి ? తెలంగాణాలో చెరువులు చాలా ఉన్నాయా ? ఎక్కువ హాస్పటల్సు ఉన్నాయా ? స్కూల్సు ఎక్కువగా ఉన్నాయా ? తెలంగాణా ప్రజలు సింహాల మాదిరిగా ఉన్నారా ? ఏనుగుల మాదిరి బలంగా వున్నారా ? ఎందుకు తెలంగాణాలో ఆ డబ్బు ఖర్చు పెటట్టం లేదు ? అని అడుగుతున్నాను. నా నియోజక వర్గానికి వెళ్లిచూస్తే అక్కడ ఏ విధమైన మార్పు రాలేదు, అన్న విషయం తెలుస్తుంది. అక్కడఅభివృద్ధి పనులేమి జరుగలేదు. అక్కడ టాక్స్ మాత్రం వేయటం జరిగింది. కమర్షియలు టాక్స్, మొదలగునవి అనేక టాక్సులు తెలంగాణాలో వేశారు. రెండున్నర కోట్లు తెలంగాణాలో మిగిల్చి, ఆంధ్రలో ఎక్కువ ఖర్చు పెడుతున్నారు. ఆంధ్రలో ఎక్కువ ఖర్చు పెట్టటంవల్ల, వచ్చిన లోటును తెలంగాణాలో వచ్చే డబ్బుతో పూర్తిచేసుకొని, ప్రపంచానికి చూపించటానికి మిగులు బడ్జెటు తయారుచేశారు. హైదరాబాదు ఆంధ్రప్రదేశ్‌కు ముఖ్యపట్టణముగా ఉన్నది. కాని తెలంగాణాలో ఉన్నడబ్బును హైదరాబాదు పట్టణంలో ఖర్చుపెడుతున్నారు. మొత్తం ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలనుండి వచ్చే డబ్బును హైదరాబాదులో ఖర్చుపెట్టటంలేదు. ప్రత్యేకంగా తెలంగాణాలో వచ్చే ఆదాయాన్ని హైదరాబాదులో గవర్నమెంటు ఉద్యోగస్థులకు ఇళ్లకొరకు ఖర్చు పెడుతున్నారు.

నాకు రామాయణం కథ జ్ఞాపకం వస్తున్నది. రావణాసురుడు సీతను ఎత్తుకు పోయినట్లు, ఆంధ్రులు తెలంగాణాను అపహరించినట్లు అయినది. ఇప్పుడు ఒక గౌరవ సభ్యుడు విభీషణుడు మాదిరి మాట్లాడాడు. రావణుడు సీతను ఎత్తుకు పోయినప్పుడు, విభీషణుడు రావణునితో చెప్పినట్లుగా ఆ సభ్యుడు విభీషణుడు మాదిరి చెప్పినాడు. కాని యీ విభీషణుడు యుద్ధం చేసేటప్పుడు ఎక్కడ ఉంటాడో అర్థం కాదు. (హర్ష ధ్వనులు) భారతంలోని ద్రోణాచార్యులు మాదిరి, రామాయణంలోని విభీషణుడు మాదిరి ఈ గౌరవ సభ్యుడు అవుతారా అన్నది మనం చూడవలసిఉన్నది.

నేను ఇది ఉదాహరణగా చెబుతున్నాను. ఇప్పుడు రాముడు లేడు, సీత లేదు. ఇప్పుడు ప్రభుత్వం ఈ బడ్జెట్టు ప్రవేశపెట్టినది. పల్లెటూళ్లలో వ్యవసాయము చేసే వాళ్ళుకూడ, సంవత్సర బడ్జెటును

ఏర్పాటు చేసుకొంటాడు. మంచిగా పని చేసి, వ్యవసాయాన్ని బాగా అభివృద్ధిలోకి తీసుకు వచ్చిన నౌకర్ల ను ఉంచుకొంటాడు. పని చేయకుండా ఊరికే కూర్చునే వారిని, తీసివేస్తాడు. కాని ప్రభుత్వంలో ఏమి జరుగుతుంది ? ఏమీ పని చేయని వారిని కూడా ఉంచుకోవటం జరుగుతున్నది

ఆంధ్ర ప్రదేశ్‌ను పరిపాలించుటకు ఎన్నో శాఖలు ఉన్నాయి ఆ శాఖలను నడపటానికి ఒక్కొక్క మంత్రి ఉన్నారు. మంత్రి జీవం లాంటి వారు. ఉద్యోగులు శరీరం లాంటివారు ఆత్మ సరిగా ఉంటేనే శరీరం బాగా ఉంటుంది. ఇప్పుడు ఆత్మలోనే లోపం ఉన్నదని నేను అనుకొంటున్నాను. అంటే మంత్రు లలోనే లోపం ఉందని అనుకొంటాను. డిపార్టుమెంటులో ఉండే లంచగొండి తనానికి, సోమరి తనానికి మంత్రియే భాధ్యుడని నేను చెబుతున్నాను. గొర్రెలను కాచే గొల్లవాడి దగ్గర "తన దగ్గర ఎన్ని గొర్రెలు ఉన్నాయో" లెక్క ఉంటుంది. వాడిని ఎప్పుడు అడిగినా వెంటనే లెక్క చెప్పగలడు. కాని ప్రభు త్వంలో ఏమి జరుగుతోంది? "మీ డిపార్టుమెంటులో అన్యాయం జరుగుతోంది అని అంటే "మాకు తెలియదు, మాకు దరఖాస్తు ఇవ్వండి, మాకు రుజువు చేయండి" అని చెబుతారు ఒక గొర్రె ఎక్కడికైనా పోతే, "నా మందలో ఒక గొర్రె పోయిందని" వెంటనే గొల్లవాడు కనిపెడతాడు. ఆ విధంగా కనిపెట్ట లేక పోతే తప్పు గొల్లవాడిదేగాని, గొర్రెల తప్పుకాదు. అదే విధంగా డిపార్టుమెంటులో జరిగే లోపాలకు మంత్రి బాధ్యత వహించాలి. మంత్రులు ఆకస్మిక పర్యటన చేయటంలేదు.

తెలంగాణాలో భర్తీ కావలసిన ఉద్యోగాలు ఉంటే, వాటిని తెలంగాణాలో ఉండేవారికి ఇవ్వక ఆంధ్ర దేశమునుండి తబాదిలా చేసి, ఇక్కడి ఖాళీలను పూరి చేస్తున్నారు. 5 ఉద్యోగాలు ఉంటే, 2 తెలంగాణా వారికి, 3 ఆంధ్రవారికి ఇవ్వాలని నిర్ణయం ఉన్నది. కాని ఇందులో చాలా చమత్కారం చేస్తున్నారు. హైద రాబాదు సిటీలో 5 ఉద్యోగాలు ఖాళీగా ఉంటే, ఆంధ్రానుండి తబాదిలా చేసి, ఇక్కడ పెట్టం జరుగు తోంది. ఈ విధంగా మార్పు జరుగుతున్నది. గవర్నమెంటు ఉద్యోగాల ఖాళీలను భర్తీ చేసేటప్పుడు ఆంధ్రు లకు ఎక్కువ ప్రాముఖ్యత ఇస్తున్నారు. తెలంగాణా వారిని వేసుకోకుండా ఒక ఆట ఆడటం జరుగుతున్నది. హైదరాబాదు సిటీలో సనత్‌నగర్‌లో ఆంధ్రనుండి వచ్చిన గవర్నమెంటు ఉద్యోగులు ఉన్నారు. వారు ఒక చోటినుండి ఇంకొకచోటికి వెళ్లాలంటే బస్‌పాసులు ఇచ్చారు ఆ బస్‌పాసులకు ఆరురూపాయలు మాత్రమే తీసుకొంటున్నారు. ఒకవైపున బస్సులకు ఆదాయం లేదని చెబుతున్నారు. మాసానికి 20 రూ. అయ్యేబస్సు పాసులను రూ. 6లకే ఇప్పించటం, తెలంగాణా ఉద్యోగులకు అటువంటి పాస్‌లు ఇవ్వక పోవటం, ఆంధ్రా వారిపైన ప్రేమచూపించి, తెలంగాణా వారిపైన ప్రేమ చూపించక పోవటం జరుగు తున్నది. ఈ విధంగా ప్రభుత్వ పరిపాలనజరుగుతున్నది. ఏమైనప్పటికి ఆంధ్రలోని పరిస్థితులు వేరు. తెలంగాణాలోని పరిస్థి తులు వేరు. సాధారణంగా భోజనాలలో వడ్డించేవాడు మనవాడైతే మనం ఎక్కడ కూర్చున్నా ఫరవాలేదు. అట్లాగే ప్రభుత్వంలో మెజారిటీ, అధికారం ఆంధ్రవాళ్ల చేతిలోనే ఉంది కాబట్టి వాళ్ల సౌకర్యాలు వారు జాగ్రత్తగా చూసుకొంటూ తెలంగాణావారిని సవతి బిడ్డల మాదిరిగా చూస్తున్నారు . . . . . . . .

శ్రీ రాజా వి. వి. కృష్ణంరాజాబహదూర్ (తుని) :—అధ్యక్షా, 1958—59 సంవత్సరము నకు మన ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు ప్రవేశ పెట్టిన బడ్జెటును నేను సంతోష పూర్వకముగా బల పరుస్తూ కొన్ని ముఖ్యమైన విషయాలు ప్రభు త్వ దృష్టికి తెస్తున్నాను. గతసంవత్సరపు బడ్జెటు లోటుగా ఉన్నప్పటికినీ, కొన్ని విషయాలలో వారు కొంత డబ్బును మిగులుగా కేటాయించిన సంగతి వారు తెలియ

చేశారు గత సంవత్సరములో ఉన్న పరిస్థితులను బట్టి లోటు బడ్జెటు సమర్పించవలసి వచ్చిందనీ, యీ సంవత్సరము పరిస్థితులను బట్టి Surplus Budget ను ప్రతిపాదించగలిగినానని, అందువల్ల ముఖారి రాగమునుంచి ఈ సంవత్సరము ఆనంద భైరవి రాగములోనికి వచ్చామని తన బడ్జెటు ప్రసంగములో చెప్పారు అయితే ఈ సందర్భమును గురించి సభ్యులు మాట్లాడుతూ కొన్ని విమర్శలు చేశారు. ఆంధ్ర ప్రాంతమునుంచి వచ్చిన రాబడిలోను, తెలంగాణా ప్రాంతమునుంచి వచ్చిన రాబడిలోను వ్యత్యాసములు ఆర్థికమంత్రిగారు చూపించారని సభ్యులు కొంత మంది విమర్శించారు. గత సంవత్సరము వరకు మనము వేరు వేరు ప్రాంతాలలో నివసించి, నేటికి గదా ఆంధ్రుల మందరము ముక్కోటి ఆంధ్రులుగా ఇక్కడ ఆంధ్ర ప్రదేశ్‌లో ఒక్క చోటకు చేరుకున్నాము. ఈ సంగతి అందరికి తెలిసిన విషయమే. మనము వేరు వేరు ప్రాంతాలలో ఉన్నందువల్ల మనము వేరు వేరు పరిస్థితులను దాటుకుని వచ్చాము. సభ్యులు చేసిన విమర్శలు చూస్తే ఆంధ్ర అని, తెలంగాణా అని విభేదాలతో మాట్లాడారే కాని, ఆ విధముగా మాట్లాడడము మన ఆంధ్ర జాతియొక్క శ్రేయస్సు కొరకు కాదని, అది న్యాయము కాదని మనవి చేస్తున్నాను. ఆంధ్రుల మందరము ఒక్క చోటుకు చేరి మన యొక్క జాతి పరిస్థితులను బాగుచేసుకోవాలనే ఉద్దేశ్యముతో మన మందరము ఆంధ్ర ప్రదేశ్‌ను ఏర్పాటు చేసుకున్నాము గనుక, సభ్యులు యీ విషయమును మరచిపోయి విమర్శలు చేయడం నాకెంతో విచారకరముగా నున్నది. ఇక మీదటనైనా ఇలాంటి ప్రాంతీయ విభేదాలను విస్మరించి, ఆంధ్ర జాతి అంతయు ఒక్కటేనని భావించవలసిందిగా నేను ఉభయ ప్రాంతాలవారిని వినయపూర్వకముగా ప్రార్థిస్తున్నాను.

ఆర్థిక మంత్రిగారు ప్రవేశ పెట్టిన ఈ బడ్జెటును మనము ఏ విధముగా ఉపయోగ పరచుకోగలము అనే విషయమును గురించి మనము యిప్పుడు చర్చిస్తున్నాము. జీవితములో మనకు ఉన్నటువంటి ఆర్థిక మాంద్యము వల్ల మనకు వ్యవసాయ రంగములో ఏర్పడిన పరిణామాలను ఎదుర్కొనటానికి ప్రభుత్వము ఏవో కొన్ని కట్టడములు, ప్రాజెక్టులు ఏర్పాటు చేస్తున్నారన్న సంగతి అందరికీ తెలిసిన విషయము. ఈ కార్య కలాపాలకు ఎంతో డబ్బు అవసరమని కూడా గుర్తించాలి. వ్యవసాయము అభివృద్ధి చేసుకోవడానికి ప్రభుత్వం కలుగజేస్తున్న సౌకర్యాలద్వారా, మనము వ్యవసాయాభివృద్ధిని కొంతవరకైనా మేలుగా సాధించగలుగు తున్నామని నేను వేరే చెప్ప నక్కరలేదు. ఈ సౌకర్యాల ద్వారా గత సంవత్సరము అదివరకు కంటే 33 లక్షల టన్నుల ధాన్యమును మనము surplus గా పండించగలిగాము. ఈ విధముగా ప్రభుత్వము చేసే సౌకర్యాల మూలంగా, ప్రతి సంవత్సరము వ్యవసాయమును అభివృద్ధి పరచుకుంటూ, ఆహార ధాన్యాలు ఎక్కువగా పండించ గలమని ఆశిస్తున్నాను. మా జిల్లా డెల్టా ప్రాంతమని చెబుతున్నారే కాని, అక్కడ కూడ నాలుగు మెట్ట తాలూకాలు ఉన్నవి. అవి గూడ చాల మట్టుకు వెనుక బడిన తాలూకాలే. ఇక్కడ తెలంగాణాలో ఏ విధముగా వెనుక బడి ఉన్నవో అక్కడ తూర్పు గోదావరి జిల్లాలో కూడ ఈ నాలుగు మెట్ట తాలూకాలు అదే స్థాయిలో ఉన్నవి. తాలూకాల అభివృద్ధి కొరకు ఏ మాత్రము డబ్బు ఈ సంవత్సరము కేటాయించబడలేదు. అక్కడ కూడ ఎన్నో చిన్న చిన్న నదులు ఉన్నవి. తాండవ, పంపానది, ఏలేరు వగైరా నదులు పారుతున్నవి. ఈ నదులలోని నీరు వృధా పోకుండా కట్టలు కట్టించే ఏర్పాటు చేస్తే ఎంతో భూమి వ్యవసాయమునకు ఉపయోగపడగలదు. డబ్బుకూడ ఎక్కువగా ఖర్చు చేయ నవసరములేదు. కొద్ది ఖర్చుతో ఎక్కువ ప్రయోజనము సంపాదించవచ్చు. ఆర్థికమంత్రిగారు, రివిన్యూ మంత్రిగారు యీ విషయములో శ్రద్ధ తీసుకుంటారని ఆశిస్తున్నాను.

ఇంతేకాకుండా మాతూర్పుగోదావరి జిల్లాలోని పెద్దాపురం, పిఠాపురం, తుని తాలూకాలు ఇది వరకు జమిందార్ల పరిపాలనలో ఉంటూవచ్చినవి. ఆతాలూకాలలో లనేకచెరువులు ఆనాటి జమిందార్లు ఏర్పాటుచేశారు. అవిఅన్నీ రానురాను చికిత్సాపద్ధతిలోకి వచ్చినవి. ఇదివరకు జమిందార్ల హయాములో ఎట్లా ఉన్నవో ప్రభుత్వం అవి స్వాదీనం చేసుకున్నతరువాత కూడ ఏలాంటి మరమ్మతులు లేక అదేస్థితిలో ఉంటున్నవి. ఆచెరువులమీదఆధారపడి ఎంతోమంది పేదప్రజలు నివసిస్తున్నారు. ఇప్పటికైనా ఆచెరువులను మరమ్మతు చేయిస్తే అక్కడవున్న భూమిని ఎంతోఅభివృద్ధి లోనికితేవచ్చు. ప్రభుత్వముఅక్కడ పేదప్రజలయందు కొంతసానుభూతి చూపించి ఆచెరువులను మరమ్మతు చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

తరువాత మరొకవిషయము ప్రభుత్వదృష్టికి తెస్తున్నాను తుని టౌను అటు విశాఖపట్టణము 90మైళ్ళ దూరములోనున్నది. ఇటు కాకినాడ 40మైళ్ళదూరములోనున్నది. ఈలోపల ప్రసూతి చికిత్సకు ఆడవాళ్ళకు సరియైన Maternity Hospital సౌకర్యములు లేవు. ఏనాడోరాణీసాహెబ్‌గారు తునిటౌను లో ఒక Maternity Hospital నిర్మించారు. అదిమొట్టమొదట ఏస్థాయిలో వున్నదో యిప్పటికికూడ ప్రభుత్వంఏలాంటి improvements చేయకనే అదేస్థితిలోవున్నది. నేను ఈవిషయమునుగురించి ఇదివరకు ప్రతిసంవత్సరము బడ్జెట్‌సమావేశములలో గాని, ఇతర సమావేశములలోగాని Health విషయమునుగురించి వచ్చినప్పుడు ఎన్నోసార్లు ప్రభుత్వాన్ని అర్థించి యున్నప్పటికినీ ప్రభుత్వం తగు శ్రద్ధతీసుకోలేదు. Maternity Hospital యొక్క అవసరము, ఉపయోగము, ముఖ్యంగా ప్రసూతి ఆడవాళ్ళకు ఏలాంటిసందర్భములో అవసరమో ప్రభుత్వానికి తెలియకపోలేదు తునిటౌన్‌కు చుట్టు ప్రక్కల లక్షలకొలది ప్రజానీకము ఉంటున్నారు. ఇదితాలూకా కేంద్రముగనుక ఈహాస్పిటలును త్వరలో improve చేయిస్తారని ఆశిస్తున్నాను. ఈసంవత్సరము Surplus Budget గా ఉన్నప్పుడైనా వెనుకబడినమెట్టతాలూకాల విషయములో నైనా కొంతవరకు డబ్బుకేటాయించి యున్నట్లయితే బాగావుండేది. ఆవిధముగా ఆర్థిక మంత్రిగారు చేయకపోవడమువల్ల నేను చాలావిచారపడుతున్నాను.

తుంగభద్ర ఎగువకాలవను గురించి ప్రభుత్వము ఎంతోడబ్బు కేటాయించి ఖర్చుచేస్తున్నారు. ఈ కాలవ upland areas కొరకు నిర్మించుతున్నారు. అదేమాదిరిగా upland areas విశాఖపట్టణము, శ్రీకాకుళము, తూర్పుగోదావరిజిల్లాలలో మెండుగావున్నవి. అక్కడకూడ ఈలాంటి ఎగువకాలవ ఏర్పాటు చేస్తేమంచిది. పంపానదికి ఒకకట్టకట్టి నట్లైతేఅక్కడనీటితో రెండవపంటకు ఆధారభూతముగా ఉంటుందని , సుమారురెండువేల ఎకరాలకు ఉపయోగపడుతుందని దీనికి ఏ 30 లక్షలతో చాలునని ఇదివరకు ఇంజనీర్లు సలహాయిచ్చారు. దీనివిషయములో ప్రభుత్వము ఏలాంటి శ్రద్ధ తీసుకోకపోవడమువల్ల 1949 వసంవత్సరములో ఈనదిపొంగి వరదలు వచ్చి, అన్నవరంకు ఆనుకొని వున్న బ్రిడ్జికూడకొట్టుకొనిపోయింది. ఆవరదవల్ల చాలాచోట్ల ఇసుకమేటలువేసింది. రైతులుఎంతోనష్ట పడ్డారు. ఈవిషయము మంత్రులు వెళ్ళిస్వయముగా కూడచూచారు. కాని దీనివిషయము ప్రభుత్వం ఎత్తుకోలేదు. ఈసంవత్సరమైనా ఏమైనా తలపెట్టుతారని ఆశించాను. కాని ఏమాత్రము allot చేయలేదు. ఇదిచాలా విచారకరము. ఎంతోతక్కువ సొమ్ముతో ఎక్కువ ప్రయోజనము పొందవచ్చు. పోనీ,

ఇంజనీర్ల సలహా ప్రకారమైనా దీనికి ఏ రు. 35 లక్షలో ఖర్చుచేస్తే దీనివల్ల ప్రజలు వ్యవసాయ రంగములో మరింత వృద్ధికి వస్తారు. 1952వ సంవత్సరములో మద్రాసుపెసిడెన్సీలోఉండగా రైతుప్రూడి కోటనందు రోడ్డువేసేసంవత్సరములో fam'ne road అని ఒక మట్టిరోడ్డు యాభై వేలరూపాయలు కేటాయించి వేయించారు అది కంకరరోడ్డు అయినా చేయలేదు ఈవిషయమును గురించి ఇప్పటివరకు ప్రతి ఎసంబ్లీ సమావేశములోను ప్రభుత్వానికి చెబుతూనేవున్నాను. ఆరోడ్డువేసిన ప్రాంతమంతయు కొండ ప్రాంతము. మట్టిరోడ్డుపోయక ముందే ఆవాటికొంతవరకు బాగావుండేది. అలాంటిదిమట్టిరోడ్డు పోయడమువల్ల కంకరవేయకపోవడమువల్ల వర్షాకాలములో రోడ్డుచెడిపోయినది. Traffic అంతా ఆగిపోయినది. ఈరోడ్డు అటువిశాఖపట్టణమునకు, ఇటుగోదావరి జిల్లాలకు అందుబాటుగా ఉపయోగపడు తున్నది. Agency ప్రాంత ప్రజలు తాము పండించిన కాయధాన్యములు వగైరాలు అటువిశాఖపట్టణమునకో ఇటు పెద్దాపురము, పిఠాపురము మీదుగా కాకినాడ తెచ్చుకొని అమ్ముకొనే వసతిగలవారి. ఈరోడ్డు ఎంత ప్రాముఖ్యమైనదౌతుందో ప్రభుత్వం గమనిం చాలని నామనవి. ప్రభుత్వము పలుచోట్ల పలువిధములుగ డబ్బు ఖర్చుచేస్తున్నారేగాని, ఇలాంటి ముఖ్య మైన రోడ్డు ప్రభుత్వదృష్టికి రాకపోవడము శోచనీయము. కాబట్టి ఈసంవత్సరమైనను ఆ రోడ్డును బాగుచేసేవిషయములో ప్రభుత్వము శ్రద్ధతీసుకుంటుందని ఆశిస్తున్నాను. వైద్యమువిషయములోను వ్యవసాయమువిషయములో ప్రభుత్వము పలుచోట్ల శ్రద్ధతో పనులు చేయుచున్నారుగాని, ఈరెండు రంగాలలో మా కూర్పుగోదావరి మెట్ట ప్రాంతము వృద్ధిచెందలేదు ప్రభుత్వము ధనము వ్యయము చేసేసం దర్భములో ముఖ్యముగా వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధిపరచుమా అన్ని చోట్లను సమానస్థాయిలోకి తేవాలని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. ముఖ్యంగా రైతులయొక్క వ్యవసాయరంగములో వారికి వుంటున్న ఆర్థిక మాంద్యము ను దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వము సొమ్ము వ్యయముచేయాలని నాసలహా.

తరువాత manures సప్లై విషయము ఒకటివున్నది. ఈ manures, విత్తనాలు వరఖరా మామెట్ట తాలూకాలలో అదునుకు సప్లై కావడములేదు. తరుణము అయిపోయినతరువాతనే ఇవి సప్లయి అవుతున్నవి. ప్రభుత్వవిధానములో ఇలాంటిలోటు ఎక్కడఉన్నదో గమనించి అవి త్వరలో సకాల ములో రైతులకు అందజేయాలని అంటున్నాను.

బడ్జట్ మగురించిసభ్యులుకొంతమందిమాట్లాడుతూ తెలంగాణాలో తక్కువగనుఆంధ్రలోఎక్కువ గను కేటాయింపుచేశారని తెలంగాణాలో ఆదాయముఎక్కువని ఆంధ్రలో తక్కువని అంటున్నారు. కాని ప్రభుత్వానికి అలాంటిదురభి ప్రాయము ఉన్నదని నేను అనలేను. రాష్ట్రమంతా ఒక్కటిగానే భావించాలి. ముందు ఎక్కువ ఉత్పత్తి ఎక్కడకాగలదో అదేదృష్టితో ప్రభుత్వము యీఖర్చులు చేస్తున్నారని నాఅభి ప్రాయము. ప్రాంతీయవిభేదములు ఉండకూడదనినామనవి. ఈసంవత్సరము మనము Surplus Budget ను తెచ్చుకోగలిగినాము. 1960 వసంవత్సరము నాటికి మనబడ్జెటు మారుకో ట్లకు చేరుకుంటుందని ఆశపడుతున్నానని ఆర్థికమంత్రిగారు చెప్పారు. పన్నులువేస్తున్నారు. పన్నులువేస్తు న్నారు అని అంటేఎలా? ప్రభుత్వము పన్నులు వేయవలసిందే. వేయక పోతే డబ్బురాదు. డబ్బువస్తేగాని ప్రజలకు సౌకర్యాలు కలగవు. ఇలాంటిపన్నులు ఎన్నివేసినను అవివ్యవసాయ రైతులమీదవేసడుతున్నవి. వ్యవ సాయ రంగము వల్ల ప్రభుత్వానికి ధనము చేకూరుతుంది గనుక, ప్రభుత్వము ముందుగా వ్యవసాయ

రంగము మీదనే దృష్టి కేంద్రీకరించి, రైతులకు వ్యవసాయ సౌకర్యాలు కలుగ జేయాలని అంటున్నాను ఇదివరకు తెలంగాణాలోని పరిస్థితులు వేరు. ఆంధ్రలోని పరిస్థితులు వేరు. తేడాలు ఉన్నవని విమర్శించిన ప్రయోజనము లేదు. మనము ప్రభుత్వానికి పన్నుల మూలంగా ధనము చేకూరేటట్లు చేసి, మన ప్రాంతాలు అన్ని బాగుచేసేటట్లు చేయించుకోవాలి గాని, విమర్శలవల్ల లాభము లేదు. భారత దేశములో ఉన్న యితర రాష్ట్రాలకంటే, మన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమే ఆహార ధాన్యల ఉత్పత్తి విషయ ములో ముందడుగు వేసిందని, అన్నింటికంటే, ఇది surplus రాష్ట్రమని పేరు సంపాదించింది. ప్రభుత్వము చేయుకార్యకలాపముల ద్వారా మన దేశమును మనము అభివృద్ధి పరచుకొని, రాష్ట్రములోని అన్ని ప్రాంతాలుకూడా సశ్యశ్యామలంగాను, ఆదర్శ ప్రాయముగా ఉండేటట్లు చేసుకోవాలని మనవి చేస్తూ, ఈ బడ్జెటును నేను బలపరుస్తున్నాను. ఆర్థికమంత్రిగారు ప్రవేశపెట్టిన బడ్జటును ప్యాసు చేయుటానికి సహాయపడవలసిందిగా సభ్యుల నందరినీ కోరుతూ విరమిస్తున్నాను

శ్రీ ఎల్. లక్ష్మణదాస్ (పాతపట్నం—జనరల్):—అధ్యక్షా, అనుభవశాలులైన ఆర్థికశాఖా మాత్యులు, గోపాలరెడ్డిగారు ప్రతిపాదించిన బడ్జెటును నేను అంగీకరిస్తున్నాను. వారు ఇంతవరకూ 8 బడ్జెటులను ప్రవేశ పెట్టానని చెప్పారు. అది నిజంగా మన మందరమూ గర్వించదగిన విషయం. అటు వంటి అనుభవశాలురు - ఈ Plan period లో surplus budget ను ఎందుకు ప్రవేశ పెట్టినారోయని నేనుమొన్నటినుంచీ ఆలోచిస్తూనే ఉన్నాను Plan period లో surplus budget ఉండకూడదు. గత 8 సంవత్సరములనుంచి ప్రజలపై అనేక రకాలైన పన్నులు వేసినారు. ఈ సంవత్సరం మాత్రం పన్నులు వేయలేదు. ప్రజలకు ఈవిధంగా relief యివ్వడానికే వారు surplus budget ను చూపించి ఉంటారని నేను భావిస్తున్నాను. వారు 1957 వ సంవత్సరములో ప్రాముఖ్య తను గురించి చెప్పారు. వారు చెప్పిన విషయాలతో మన మందరమూ ఏకీభవించవలసినదే. కాని వారు 100 కోట్ల రూపాయలు బడ్జెటు ప్రవేశపెడదామనే ఆశతో ఉన్నారు. అట్లా ప్రవేశ పెట్టడానికి మన రాష్ట్రంలో అవకాశాలు లేక పోలేదు. మనం యీనాడు ఆంధ్ర రాష్ట్రమునుంచి ఎంత రాబడి అయినా సంపాదింప వచ్చును. ఈనాడు మనరాష్ట్రానికి 160 కోట్ల రూపాయల ఋణంఉన్నది. ఆ ఋణాన్నంతను సులభంగా తేర్చేందుకు తగిన అవకాశాలు మనకు ఉన్నవి. కాని మనం చేసే ఖర్చుల విషయంలో ప్రభుత్వం జాగ్రత్తగా యోచన చేయాలని మనవి చేస్తున్నాను. అంటే . . . . ఆ బడ్జెటు తయారు చేసే విధానం లోనే కొత్త మార్పులను తీసుకు రావడం అవసరమనిపిస్తున్నది. దేశం యొక్క అభివృద్ధి కార్యక్రమాలను కొనసాగించుకొనే సమయంలో మన ఆర్థిక స్తోమత ఎంత, మనం చేసుకొన వలసిన పనులు ఏమిటి అనే విషయాలు గమనించి బడ్జెటు తయారు చేసుకోవాలి. అట్లాచేస్తే, రాష్ట్రంలోని అభివృద్ధి చెందిన ప్రాంతాలు, వెనుక బడిన ప్రాంతాలుకూడా ఆలోచనలోనికి వస్తాయి. వెనుక బడిన ప్రదేశాలను, అభి వృద్ధి చెందిన ప్రదేశాలతో సమాన స్థాయికి తీసుకు రావడానికి ప్రయత్నం చేసినప్పుడే సామాన్య ప్రజానీకం ప్రభుత్వాన్ని అభినందించడానికి అవకాశం ఉంటుంది. గోపాలరెడ్డిగారు స్కెలిటన్ బడ్జెటును తయారు చేశారని అనేక పత్రికలూ Head lines లో వేశారు. బహుశా వచ్చే సంవత్సరం దీనికి ప్రతిఫలం కనిపిస్తుందనుకొంటాను. . . . . . . . అంటే విప్లవాత్మకమైన బడ్జెటు ప్రవేశపెడతారేమో . . . . . . . . కొంత యోచించవలసియున్నది.

వెనుక బడిన ప్రాంతాల అవసరాలను తీర్చాలి. అ[illegible] పెద్ద మేడలు, మిద్దెలు కావాలనే కోరి కలుకావు. ఎన్నో వందల సంవత్సరాలనుంచి పరాధీనమైన దేశాన్ని స్వాతంత్ర్యం పొందిన తరువాత అభి వృద్ధి చేసుకోవడమనేది సామాన్య విషయంకాదు. 10 ఏండ్లలో మనం ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలను సాధించుకో గలిగినామని గోపాలరెడ్డిగారు చెప్పారు. నిజంగా మనమంతా గర్వించుకో దగ్గ ఫలితాలనే సాధించు కొన్నాము. ప్రజా స్వామ్యం పట్ల నమ్మకం లేని నియంతృత్వ దేశాలే భారత దేశాన్ని చూచి ప్రజాస్వామ్యం పట్ల, ప్రజాస్వామిక ప్రభుత్వంపట్ల విశ్వాసము కలిగిన మనముఅభివృద్ధి కార్యక్రమాలను సాధించామని తెలుసు కొన్నారు. ఇది మన మెంతో గర్వించదగిన విషయం. సామాన్య మైన విషయం కాదు. స్వరాజ్యం సంపా దించుకోడానికి మనం 1857 వ సంవత్సరంలో నాటిన విత్తనమే మొలచి పెరిగి పెద్దదై స్వరాజ్యాన్ని సాధించింది. అంతేకాక నియంతృత్వ పరిపాలనాభిలాషులు ప్రజాస్వామ్యంమీద విశ్వాసం లేని వారు అయిన కమ్యూనిస్టుల చేత యీ నాడు కేరళలో ప్రజాస్వామిక పరిపాలన సాగిస్తున్నాము. ఇవన్నీ సామాన్యమైన విషయాలుకాదు. ఇటువంటి విజయాలు నెన్నింటినో మనం సాధించాము. మన ఆర్థిక విధానాన్ని బాగుచేసు కోవాలి మనం అనేక అభివృద్ధి కార్యక్రమాలను సాధించుకోవలసి యున్నది. వీటికై ప్రజలు పన్నులుకట్ట వలసి వాను పన్నులు కట్టడానికి ప్రజలు సిద్ధంగా ఉన్నారు. కాని మనం ఖర్చు చేసే డబ్బు లో ఎంత డబ్బు ఏ విధంగా ఖర్చు చేయబడుతున్నదో అందరికి తెలియాలి. దీని ఫలితం ప్రజలందరికీ రావాలి. ఈ విషయాలన్నీ ఆర్థిక మంత్రిగారు జాగ్రత్తగా ఆలోచించాలి. అవసరమైతే, ఆర్థిక మంత్రిగారు ఒక Permanent Financial Advisory Committee ని స్థాపించుకొని తద్వారా ఎప్పటి కప్పుడు దేశంలోని పరిస్థితులను గమనించి ఆర్థికాభివృద్ధికి ఏమేమి చర్యలు తీసుకోవాలో, ఖర్చులను ఏ విధంగా తగ్గించుకోవాలో తెల్సుకొని కార్యక్రమాలు సాగించినట్లయితే చాలాబాగుంటుందని నేను సూచిస్తున్నాను. ఈనాడు దేశములో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలు సామాన్యమైన ప్రజానీకానికి అందుబాటులో ఉండుటలేదు. Planning Minister గారు, Information departmentలో ఒకలక్ష రూపా యలు ఖర్చు తగ్గించుకోబోతున్నారని అన్నారు. అది చాలా పొరపాటు. ఇట్టి economy drive ల వల్ల ప్రయోజనం లేదని మనవి చేస్తున్నాను మనం చేసే కార్యక్రమాలను ప్రజలకు అందుబాటులో పెట్టేందుకు, సామాన్య ప్రజానీకానికి తెలియ జేసేందుకు ఎందుకు ప్రయత్నించ కూడాదని అడుగు తున్నాను. ఈ నాడు ప్రతిపక్షంలో ఉన్న వారు ప్రభుత్వం ఏమీ చేయడం లేదు అని ప్రజలలో ప్రచారం చేసే సందర్భంలో మనం చేసే కార్యక్రమాలను ప్రజలకు తెలియజేయడానికి కొన్ని లక్షల రూపాయలు ఖర్చు చేసినా ఏమీ తప్పు లేదని నేను భావిస్తున్నాను. ఇందుకోసమై బొంబాయిలో 48 కోట్ల రూపాయలు ఇంకా ఇతర రాష్ట్రాలలో 40,50 లక్షల రూపాయలు ఖర్చు చేస్తున్నారు. Public Relations Office కు చాలా ప్రత్యేకత ఉన్నది. Public Relations Officers ను జిల్లా లెవెల్‌లోనూ, రాష్ట్ర లెవెల్‌లోనూ ఏర్పాటు చేయాలి. వీటి ద్వారా ప్రజలు పెట్టుకున్న Petitions కు వెంటనే ఔననో, కాదనో ఒక కార్డు ద్వారా సమాచారాన్ని అందచేస్తే ప్రజానీకానికి ఎంత సంతోషమో ఆలోచించండి. ఇటువంటి ఆఫీసులు పెడితే ప్రభుత్వానికి ఖర్చు హెచ్చు అవుతుందని భావిస్తే . . . . . . Petition పెట్టుకునే ప్రతి ఒక్కరినీ Stamp రూపంలో ఒక రూపాయి ఇవ్వమనండి. ఇందుకు ప్రజలు ఏ మాత్రమూ వెనుదీయరు. సంతోషముతో ఆమోదిస్తారని మనవి చేస్తున్నాను. ఇందుకోసమై ప్రతి జిల్లాకు ఒక Public Relations Office ను స్థాపించి, ఒక Officer ను, తగిన

సిబ్బందిని నియమించి దేశంలో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలను ప్రజలలో propaganda చేయుటానికి తగిన డబ్బు ఖర్చుచేయాలని నేను ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తున్నాను.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వరులు —Propaganda చేయడానికి డబ్బు ఖర్చు చేయాలంటున్నారు. ఆ propaganda ఎవరిది, ఏ పార్టీకి సంబంధించినది?

శ్రీ ఎల్. లక్ష్మణ దాస్ —అది పొరపాటు అభిప్రాయం వెంకటేశ్వరులుగారు యధార్థ విషయాలను వినరు. ప్రభుత్వం చేస్తున్న అభివృద్ధి కార్యక్రమాలను ప్రజలకు తెలుపడం పార్టీ విషయమేమీ కాదు. ప్రజానీకం కలక్టరు ఆఫీసుకు వెళ్లి విషయాలు తెలుసుకొనేఅవసరం లేకుండా Public Relation Officer గారే ప్రజలకు ప్రభుత్వానికీ మధ్య సంబంధం కల్పించుకొని ప్రజలకు సకాలంలో జవాబులు ఇప్పించే ఏర్పాటు చేయాలి. దీనికి అవసరమైన డబ్బు ప్రజలనుంచి తీసుకుంటే ఎవ్వరికీ అభ్యంతరం ఉండదు. ఈ విషయంతో అందరు అంగీకరిస్తారు వెనుక బడిన ప్రాంతాలను అభివృద్ధి పరచాలి. ఈనాడు శ్రీకాకుళం జిల్లా కరువు ప్రాంతంగా ఏర్పడింది. సోంపేట, టెక్కలి, హిందూపూర్, పాతపట్నం, చీపురుపల్లి తాలూకాలలోని కొన్నిగ్రామాలు దైవికంగా కరువు ప్రాంతాలుగా ఉన్నాయి. దానికి ప్రభుత్వంవారు 7 లక్షలు మంజూరు చేసినారు. అందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. కాని ఆ డబ్బును త్వరిత గతిని వర్షాలు పడక ముందే, సకాలంలో చెరువుల మరమ్మతుకు, వాగుల అభివృద్ధికి ఖర్చు చేయాలి. అక్కడ తగిన సిబ్బంది లేక పోతే ఇతర ప్రాంతాలనుంచి సిబ్బందిని పంపి ఆ పనులు చేయించ వలసినదిగా నేను ప్రభుత్వానికి విన్నవిస్తున్నాను.

ఈ రోడ్లసు తీసుకోవడం విషయంలో గూడ ప్రభుత్వ విధానం అంత తృప్తికరముగా లేదు. బాగున్న రోడ్లను డిస్ట్రిక్టు బోర్డులనుండి Highways తీసుకోవలసిన అవసరంలేదు. ఈ నాటి జిల్లా, బోర్డులపరిస్థితి మనకు తెలుసు. వారికి Technical assistance లేదు. Highways engineers estimatesను తయారు చేయాలి. జిల్లా బోర్డులకున్న డబ్బుతో రోడ్లు తయారు కావడంలేదు. అందుచేత హైవేస్ డిపార్టుమెంటు వెంటనే రోడ్లనన్నింటిని తీసుకోవాలి. అందులో ముఖ్యంగా జిల్లా బోర్డుల చేత అశ్రద్ధ చేయబడి, మరమ్మతులు లేక చెడిపోయిన రోడ్లను తీసుకోవాలి. అటువంటి కార్యక్రమాలకు వచ్చే సంవత్సరమైనా బడ్జెటులో అవకాశం కల్పించి డాక్టరు గోపాలరెడ్డిగారు ఒక నూతన విధానాన్ని అవలంబిస్తారని విశ్వసిస్తున్నాను. ఇక శ్రీకాకుళం జిల్లాకు సంబంధించినంత వరకు చాలా విషయములను నేను ప్రభుత్వ దృష్టికి తీసుక రావలసి ఉన్నది. అది క్రొత్తగా ఏర్పడ్డ జిల్లా. అక్కడ ఒక కాలేజీని ప్రభుత్వం స్థాపించింది. కాని అందుకు తగ్గ భవనములు లేవు. అక్కడి జడ్జికోర్టు విశాఖపట్టణంలో ఉన్నది. పోలీసు సూపరింటెండెంటు ఆఫీసు విజయ నగరంలో ఉన్నది. ఆ ఆఫీసులన్నీ శ్రీకాకుళం జిల్లాకు తరలించాలి. అదే విధంగా రెండు లక్షల జనాభా గల పాతపట్టణం తాలూకాలో కేసులు తక్కువనే నెపముతో మాజిస్ట్రేటు కోర్టును ఎత్తివేయడం జరిగింది. కేసులు తక్కువైతే అక్కడిప్రజలను అభినందించ వలసి యున్నది. కాని ఉన్న కేసుల విషయంలో నైనా ప్రజలు చాలా దూరం వెళ్ల వలసి వస్తున్నది. కనుక వెంటనే అక్కడ మాజిస్ట్రేటు కోర్టును పెట్టాలి. తాలూకా ఆఫీసు గత 18 సంవత్సరములనుండి అద్దె

ఇంటిలో ఉన్నది. అది సౌకర్యముగా లేదు. మధ్యన ఒక రేవు ఉన్నందున ప్రజలు ఇవతలి వైపుకు వెళ్ళ వలయునన్న పర్లాకిమిడి మీదుగా రావాలి. అది ఒరిస్సా ప్రాంతం కాబట్టి ప్రజలకు చాలా ఇబ్బందిగా ఉంది. అందువల్ల పాతపట్టణంలో వెంటనే వీలైతే యీ సంవత్సరమే ఒక తాలూకాఫీసును పెట్టాలి. రెండు సంవత్సరముల నుండి బడ్జెట్‌లో allotment ఉన్నది కాని ఇంత వరకు ఎందుచేత పెట్టలేదో, దానికి కారకులెవ్వరో తెలియదు

మేము బడ్జెట్ సందర్భంలో అసెంబ్లీలో అనేక సూచనలు చేస్తుంటాము మేము చేసిన సూచనలు మంచి వేనా, కాదా, ఆచరణయోగ్యమైనవేనా, కాదా? అనే విషయం పరిశీలన చేసి ఆచరణయోగ్యం కానియెడల మాకు తెలియ చేయవలయును. దాని వల్ల మరల వచ్చే సంవత్సరం వాటినే సూచించవలసిన అవసరం ఉండదు. మేమువేసిన సూచనల కంటే ఆచరణ యోగ్యమైనవి, మంచివి ప్రభుత్వమునకు లభించిన అవిగూడ సభ్యులకు తెలియ జేయడం అవసరం. ప్రభుత్వం వీటినన్నింటిని శ్రద్ధగా పరిశీలిస్తుందని ఆశిస్తూ నాకు ఈ అవకాశమిచ్చిన అధ్యక్షులకు ధన్యవాదములు అర్పిస్తూ విరమిస్తున్నాను.

డాక్టర్ బి. వి. యల్. నారాయణ (ఒంగోలు-రిజర్వుడు) :—అధ్యక్షా, ఈ బడ్జెట్‌లో వైద్య శాఖకు కేటాయించిన ధనము చాలా తక్కువగా ఉన్నదని తెలియ జేయుటకు విచారిస్తున్నాను. ఈ కేటాయించిన మొత్తంలో establishmentకు తదితర పద్దులకు పోగా పేదవారికి, రోగులకు కావలసిన మందులకు తొమ్మిది లక్షల రూపాయలు మాత్రమే ఉన్నది. మనంఎన్ని భవనములను, ఆస్పత్రులను కట్టించిన పేదవారికి తగినంతమందు ఇవ్వలేనప్పుడు అవిఅన్నివృథాయే. అనేకతాలూకా అస్పత్రులలో గూడా పేదవారు వచ్చినప్పుడు డాక్టర్లు మందు లేదంటున్నారు. మందుకు బదులు నీరు పోసి ఇస్తున్నారని ప్రజలంతా అంటున్నారు. దీనికంతకు కారణం ప్రభుత్వం తగినంతమందు సమకూర్చక పోవడమే. పేదప్రజలకు మందు అందునట్లు డబ్బును కేటాయించమని మిమ్ములను కోరుచున్నాను. మొదట హైదరాబాదులోని Blood Bank కు ఐదు లక్షలు మంజూరయినది. ఇప్పుడు 51 వేలు గ్రాంటుచేసినారు. మనదేశంలో Blood Banks చాలా తక్కువగా ఉన్నవి. వాటి అవసరములను ప్రజలు పూర్తిగా గ్రహించినట్లు లేదు. వంద బెడ్ను ఉన్న ప్రతి ఆస్పత్రికి ఒక Blood Bank . ఉండడంఅవసరం . వీటివల్ల రోగి ఆస్పత్రిలో ఉండవలసిన కాలం తగ్గి , ఖర్చు తగ్గుతుందని గమనించాలని కోరుచున్నాను. తరువాత పీడియాటిక్ సైన్సు మన దేశంలో చాలా వెనుక బడి ఉన్నది. అందులో ముఖ్యంగా మన రాష్ట్రంఅన్ని రాష్ట్రాలకంటే గూడ వెనుకబడిఉన్నది. పీడియాటిక్ సెంటర్సుకు కొంతవరకు డబ్బు ఇచ్చినారు. పీడియాటిక్ ట్రైనింగ్సుకు ఎక్కువ సహాయం చేసి పిల్లల ఆరోగ్యం కొరకు వాటిని ఇంకా ఎక్కువ చేస్తారని నేను ఆశిస్తున్నాను. ఫైలేరియా వ్యాధి నివారణకు ముందు ఇచ్చిన గ్రాంటుకన్నా ఇప్పుడు చాలా తగ్గించి వేయడం అన్యాయంగా కనబడుచున్నది. అది ఒకసారి వచ్చిన వదిలించుకోవడం చాలా కష్టం. కాబట్టి ఈ జబ్బు రాకుండా preventive measures ఎక్కువగా తీసుకోవాలి. కనుక గ్రాంటు తక్కువ చేయకుండ రూ. 14 లక్షలు ఇచ్చి ప్రజలకు సౌకర్యం చేయాలని నేను ప్రభుత్వమును కోరుచున్నాను. Distribution of tined milk నిమిత్తం రూ. 51 వేలు గ్రాంటు గా ఇచ్చినారు. కాని ఈ డబ్బు దుర్వినియోగమగుచున్నది పిల్లలు పంచదార లేనందున ఒలవంతం చేసినన, త్రాగడంలేదు. కాబట్టి ఈ డబ్బును save చేసుకోవచ్చును. National Extenstion Scheme

క్రింద ఉన్నటువంటి ఆస్పత్రులు ఎలా నడుస్తున్నవో చూడాలి అక్కడ క్రొత్త డాక్టర్లను నియమిస్తున్నారు లేక పోతే రిటైర్ కాబోయేవారిని వేస్తున్నారు. క్రొత్తగా వచ్చువారు నవీన పరికరములు అనగా X-Ray మొదలగు వాటిలో తర్ఫీదు పొందిన వారు కావడంచేత వాటి సహాయం లేకుండా వ్యాధిని కనుగొనడం కష్టం. కాబట్టి అటువంటి వారిని కొంత కాలం వరకు పెద్ద పెద్ద ఆస్పత్రులలోనే వేయవలయును. 10 సంవత్సరముల ప్రాక్టీసు వారికి తప్పకుండ National Extension Scheme లో పని చేయవలెనని రూలు పెట్టిన చాలా ప్రయోజనకరంగా వుండునని తెలియజేయుచున్నాను. వారికి తగినంత ధనం ఇచ్చి మందులు సప్లయి చేయించాలి. చుట్టు ప్రక్కల ఉన్న గ్రామాలకు వైద్య సహాయములు కలుగ చేయటానికి వీలుగా ఆంబ్యులెన్స్‌లు సప్లయి చేయించాలి. కొన్ని చిన్న గ్రామాలకు అయినా అందుబాటులో వుండేటట్లు హస్పిటల్సు ఏర్పాటు చేయి ్చాలి. ఇటువంటి సౌకర్యములు కలుగ చేయాలని మంత్రిగారికి విజ్ఞప్తి చేస్తున్నాను.

శ్రీ యమ్. ఎస్. రాజలింగం (చిల్లంచర్ల):—అధ్యక్షా, ఈ సంవత్సరము మన ఎదుటవున్న బడ్జెటును చూచి చాలా మంది అభినందిస్తున్నారు. ఇది డెఫిసిట్ బడ్జెటు కాకపోవటమే దానికి కారణము, కేంద్ర ప్రభుత్వమునుండి లభించినధన సహాయము కారణము కావచ్చును. కాని ఒకవిషయములో తీవ్రమైన అసంతృప్తి వుందని నేను చెప్పతున్నాను. మన బడ్జెట్టులో ఎక్కువ మొత్తమును సేకరించే అవకాశములు చూపించామా ? లేదా అన్నది కాకుండా బడ్జెటులో చూపించిన ప్రతి రూపాయి సక్రమంగా వినియోగింపబడుతున్నదా లేదా అని చూచుకోవలసివుంది. బలవంతాన వసూలు చేయబడినప్పటికి, ఆ డబ్బు దేశానికి సక్రమ మార్గాన వినియోగింప బడటం లేదనే అసంతృప్తి ప్రజలలో కలుగకుండా వుండాలి. ఆ అసంతృప్తి డబ్బు ఖర్చు పెట్టే ఏ సెక్షన్‌లో కలిగి నప్పటికీ అది రాష్ట్రానికి, దేశానికి అవమానమును కల్గించినట్లు అవుతుంది భవిష్యత్తులో అతి తీవ్రమైన దెబ్బకు దారి తీస్తుంది ఆంధ్ర ప్రదేశ్‌లో ఆంధ్ర తెలంగాణా అనే పదాలను ఉపయోగించకూడదు. వాటిని రూపు మాపాలి అని నేను భావించాను. విశాలాంధ్ర ఉద్యమమును మొదటినుండి , చివర వరకు నడిపిన వారిలో నేను ఒకడిని . ప్రత్యేక తెలంగాణా కావాలని కొందరు కోరారు. తెలంగాణా రీజినల్ కమిటీ అని ఏర్పడింది. వాటిని మేము వ్యతిరేకించాము. అప్పుడు మేము చెప్పిన విషయాలు సహారాలో ఏకాకిగా వున్నవాడి voice వలె వుండి పోయింది. అప్పుడు పబ్లిక్ ఒపీనియన్ నాకు అనుకూలముగావుంది. కాని సెంటిమెంటుకు వ్యతిరేకముగా వుంది. ఎవరికి వ్యతిరేకంగా ఏమి మాట్లాడితే కొంప మునుగుతుందేమోననే ఉద్దేశ్యముతో అటు ఆంధ్ర నాయకులు గాని, ఇటు తెలంగాణా నాయకులు కాని నాకు చేయూత నివ్వలేదు. ఆ కారణంగానే ఈ నాడు మన speeches లో ఆంధ్ర, తెలంగాణా అనే పదాలనే రెండు పక్షాలవారు వాడటం జరుగుతున్నది. వాతావరణము అనుకూలముగా లేక పోవటం వల్ల నేనుకూడా అదే భాషకు అలవాటు పడవలసి వస్తున్నది.

ఈనాడు ఆంధ్ర ప్రజకు, తెలంగాణా ప్రజకు మధ్య తేడా ఏమి లేదు. వాణిజ్యములో కాని, వ్యాపారములో కాని, వ్యవసాయములో కాని పెద్ద తేడాలు లేవు. కాని ఈ'ఆంధ్ర,' 'తెలంగాణా'అనే పదము సర్వీసెస్‌లో చాలా తీవ్రముగా వినిపిస్తున్నది. దీనివల్ల క్రమంగా ఎడ్మినిస్ట్రేషన్ దెబ్బ తినవచ్చు. ఎడ్మినిస్ట్రేషన్ దెబ్బ తింటే ప్రభుత్వమే దెబ్బ తింటుంది. ప్రభుత్వమే దెబ్బ తింటే రాజ్యాంగమే దెబ్బ తింటుంది. అప్పుడు Constitution దెబ్బ తింటుంది.

నేను ఇప్పుడు సర్వీసెస్ విషయములోనే కొంత విమర్శ చేయదలచుకొన్నాను. కొన్ని డిపార్టుమెంటుల ఆఫీసర్లను స్నేహ రూపంగానో మరో విధంగానో నేను కలిశాను. వారు నాకు కొన్ని విషయములు చెప్పారు. కాని వాటిని మొదట నేను నిర్లక్ష్యము చేశాను. ఎవరికి ఏ విధమైన అన్యాయము చేయటానికి ఈ ప్రభుత్వము ఏర్పడలేదు అని నేను చెప్పాను కాని క్రమముగా కొన్ని విషయములు మాత్రము ప్రభుత్వ దృష్టికి తీసుకు వచ్చి, వాటిని సవరించవలెననే కోర్కె నాకు కల్గినది. ఇప్పుడు అన్ని డిపార్టుమెంటుల విషయం ప్రస్తావించక, ముందు Sales-tax Department కేసుం గురించి మాత్రమే మాట్లాడ దలచుకొన్నాను ఆ డిపార్టుమెంటు లోని ఉద్యోగులకు అన్యాయములు జరిగినవని, లేదా జరిగినవనే భావం కలగటానికి ఆస్కారము వుందని నేను మనవి చేస్తున్నాను. టాలన్ హోప్ సిస్టమును మద్రాసునుండి తెచ్చి ప్రవేశ పెట్టారు. ఇదివరకు హైదరాబాదులో Government of India వారి system వుండేది. ఏ కారణం వల్లనో Government of India వారి system, మంచిది కాదని అనుకొన్నాము. అది ఒకప్పుడు మంచిది అనే భావించబడింది. కాని తరువాత అది మంచిది కాదని అనుకోవటంలో తప్పేమీ లేదు. ఈ కొత్త సిస్టమ్ వచ్చిన తరువాత పీరియాడికల్స్, రిజిస్టర్స్ కొత్తగా తయారు చేయమవలసిన పరిస్థితిఏర్పడింది. అవి తయారుచేసేటప్పుడు పాతవాటికి అలవాటుపడిన క్లర్క్ కి కొత్తపద్ధతి ప్రకారం తయారు చేయటంలో కొంత ఇబ్బంది కలుగుతుంది. దీనివలన వారికి Show Cause Notice's ఇవ్వబడుతున్నాయి. తరువాత పనిష్మెంట్సు ఇవ్వబడుతున్నాయి. ఆ వ్యవహారము తెలంగాణావారికి శుభకరముగా కన్పించటము లేదు.

Central Circle of sales tax department ఒకటివుంది. అందులో 90% permanent Posts abolish చేయబడ్డాయి. ఏ కారణం వల్లచేయబడ్డాయో నాకు తెలియదు. వీలైనంత వరకు ఎక్కువ మంది మన స్టేటులో un-employment కు గురికాకుండా చేసే విషయమై మనం ఆలోచించ వలసి వుంది. నేషనలైజేషన్ పేరుతోగాని, యింకో పేరుతో కాని, నిరుద్యోగమును ప్రవేశ పెట్టినట్లయితే, నేషనలైజేషన్ ను వ్యతిరేకించిన వారమవుతాము కాని, దానిని పూల హారాలతో కొలచిన వారం కామని మనవి చేస్తున్నాను. ఈ డిపార్టుమెంటులోని confirmed posts కొన్నిటిని abolish చేయటం జరిగింది. జరుగ వలసిన పని ఆగదు కనుక కొన్ని temporary posts ను create చేయడం జరిగింది. Permanent Posts ను abolish చేసి temporary posts ను create చేయటంవల్ల సెకెండ్ గ్రేడ్ గుమస్తా రూ. 45—80 సంపాదించుకోవలసి వస్తున్నది. అలాగే కొంత మంది ఆఫీసర్లు తక్కువ స్థానానికి పోవలసి వచ్చింది. S. D. O. లు గా వున్నవారు 175—320 లో వున్నవారు తక్కువ గ్రేడులోనికి పోవలసిన పరిస్థితి ఏర్పడింది. 350 రూపాయలను సంపాదించు కొనే తెలంగాణా ఆఫీసరు తనకు ఒక్క పైస తగ్గినా చాలా బాధ పడతాడు. "నేను tax ను ఎక్కువ చేసుకొని నా జీతం తక్కువ అయినది" అని అతను బాధ పడటం సహజము. దానికి సమాధానం చెప్పవలసిన అవసరం విశాలాంధ్ర వాదులపై వుంది. తెలంగాణా వారిపై ఆ బాధ్యత లేదు. ఇవి ఇట్లాగే జరుగుతాయని వారు మొదటనుండి చెప్పుతున్నారు. కనుక వారికి ఆ బాధ్యత లేదు. ఈ పరిస్థితిలో "ముందు విశాలాంధ్ర మూమెంట్ తీసుకు వచ్చిన నేను దేశానికి ద్రోహం చేశానేమో" అని నేను చాలా బాధ పడుతున్నాను. కనుక ఈనాడు తెలంగాణా ఆఫీసరుకు

ఒక్క పైస కూడా తగ్గకుండా చూచే బాధ్యత ఈ ప్రభుత్వానికి వుందని నేను మనవి చేస్తున్నాను. Sales Tax Department లో డిప్యూటీ కమిషనర్ పోస్టు ఒకటి ఏర్పడింది పూర్వమే తెలంగాణాకు రెండు పోస్టులు వున్నాయి. మరల ఒకటి create చేయబడింది. అందులో 800—1000 ఇచ్చి ఆంధ్రనుండి ఒక ఆఫీసర్‌ను తెచ్చి వేశారు. క్రింద వారికి Promotion ఇచ్చినట్లయితే తెలంగాణా ఉద్యోగి ఆ పోస్టులోనికి వెళ్లి వుండేవాడు. కాని అలా చేయనందువల్ల తెలంగాణా ఆఫీసరుకు ప్రమోషన్ ఆగిపోయింది. అలా కొత్త Post create అయినా కూడ అది వారికి లభించనప్పుడు వారి యొక్క ఆశ దయ్యమై మనను పీడించే అవకాశం వుంది. ఈ మధ్య ఒక ఆఫీసర్ సెలవు పెట్టారు. వార్మల్ కేసెస్‌లో ఒక ఆఫీసర్ సెలవులో వుంటే next senior officer ను ఆ Post లో వేయటం సహజము కాని అలా వేయకుండ ఒక ఆంధ్ర ఆఫీసర్‌ను తీసుకు వచ్చి ఆ Post లో వేశారు. ఆ డిపార్టుమెంటులో one side transaction జరుగుతోందని నేను చెబుతున్నాను. ఇదే విధంగా ఆంధ్రలో vacancy వుంటే అక్కడ తెలంగాణా officer ను వేస్తూవుంటే బాగానే వుంటుంది. అప్పుడు ఇటువంటి కంప్లయింట్సు వచ్చేవికావు. అలా జరుగకుండ వుండటం వల్లనే ఈ నాడు తీవ్రమైన అసంతృప్తి ఆఫీసర్లలోనూ, ప్రజలలోనూ కల్గుతున్నది. మనకు తెలియకుండా ఈ ప్రభుత్వాన్ని ఎవరో misguide చేస్తున్నారు. మంత్రులు చేస్తున్నారని చెప్పాను. వాళ్లు సదుద్దేశ్యముతోనే ఉన్నా కాని ఎక్కడో mischief జరుగుతోంది. దానిని అరికట్ట వలసినదని కోరుతున్నాను. కొన్ని రివర్షన్స్ జరుగుతున్నాయి. మచ్చుకు కొన్ని ఉదాహరణలు యిస్తాను. 500—800 గ్రేడులో ఉన్న ఒక Inspector post abolish చేసి వేశారు. న్యాయంగా బహమాలీ అనే అయనకు ఆ పోస్టు రావలసి యున్నది. ఆ subsequent పోస్టులో ఆంధ్ర ఆఫీసరును వేశారు. ఇతనితో పని చేసిన వాళ్లు బొంబాయికి పోతే అక్కడ వాళ్లకు ప్రమోషన్స్ వచ్చాయి. కాని యితనికి యిక్కడ డి ప్రమోషన్ వచ్చింది. ఈ రియాక్షన్ తెలంగాణావారి minds మీద ఏ విధముగా ఉంటుందో ఒక్కసారి ఆలోచించండి. ఇది ఆంధ్ర ప్రదేశ్ స్టేటుకు గౌరవ ప్రదమా అని ఆలోచించమని కోరుతున్నాను.

ఇట్లాగే ఒక C. T. O. శలవు మీద వెడితే, ఆంధ్ర ఆఫీసరును D. C. T. O. ను తీసుకొని వచ్చి వేశారు. అంత మాత్రాన అతనిని ఎందుకని తీసుకొని రావాలి ? ఈ మాత్రం sentimental objection గ్రహించలేరా అనిఅడుగుతున్నాను. Emotional integrationకోరినప్పుడు ఈమాత్రం sacrifice చేయలేరా ? పోలీసు ఏక్షన్ తరువాత ఆంధ్ర ఆఫీసర్లు యిక్కడ కొన్ని తప్పు పనులు చేశారు . తత్ఫలితముగానే తెలంగాణా ఉద్యమము బయలు దేరినది. మళ్లీ ఆ ఆఫీసర్ల వలనే ప్రమాదాలు సంభవిసు వ్నాయి. తిరిగి అట్టి ఉపద్రవం రాకుండా చూడవలసిన బాధ్యత ప్రభుత్వం పై ఉన్నది. ఎక్కడనుంచో జూనియర్సును తీసుకొని వచ్చి యిక్కడ వాళ్లని over look చేస్తుంటే—యిక్కడి ప్రజల మనస్సు లు ఏ విధంగా ఉంటుందోఒక్కసారి అర్థం చేసుకోవాలని కోరుతున్నాను. Reorganisation of States అయిన తరువాత సీనియారిటీ లిస్టు తయారు చేయమని కేంద్ర ప్రభుత్వం direction యిచ్చింది. ఆ విధముగా సీనియారిటీ లిస్టులు తయారు చేసి సీనియారిటీకి protection యిచ్చారు కాని ప్రమోషన్‌కు protection యివ్వలేదు. ఈ సందర్భంలో ప్రభుత్వంవారుతయారు చేసిన సర్క్యులర్ ప్రకారము, ఒక ఆంధ్ర ఆఫీసర్‌కు ప్రమోషన్ యిచ్చినట్లయితే , వెంటనే ఒక తెలంగాణా ఆఫీసరుకు ప్రమోషన్ యివ్వాలని ఉంది. ఆ పద్ధతి, అనుసరిస్తున్నారా ? అన్నది నేటి సమస్య. ఒక

వేళ ఈ సీనియారిటీ లిస్టు నామినల్‌గా తయారు చేస్తే, దానికి విలువే లేదు. ఉద్యోగులు సర్వీసెస్‌కు ప్రమోషన్‌కు, ప్రొబేషన్‌కు protectionయివ్వాలి ఇంకొకచిన్నఉదాహరణమీముందు ఉంచుతున్నాను. ఆంధ్రప్రదేశ్ రాకముందు కర్నూలులో లా డిపార్టుమెంటు ఉండేది. ఆ డిపార్టుమెంటులో కొంత మంది సెలవు పెడితే, అయిదుగుర్ని ప్రమోట్ చేసారు వారందరు నాలుగు నెలలు, రెండు నెలలు, నాలుగ రోజులు—ఈ విధముగా కొద్ది పాటి వ్యవధితో higher post లో officiate చేశారు. వార్త ఆంధ్ర ప్రదేశ్‌లోకి వచ్చే సరికి యిక్కడ 6, 7, 8, సంవత్సరములు సర్వీస్ ఉన్నవారికి ప్రాముఖ్యత యివ్వకుండా, వాళ్లకు ప్రమోషన్ యివ్వడము జరిగిందని మనవి చేస్తున్నాను కనీసము 1—11—56 తేదికి ముందుగా ఆంధ్రస్టేటులో ఆరు నెలలైనా officiate చేస్తే అంతగా బాధ పడనవసరం లేదు. ఇటువంటి sudden advantages తీసుకొన్న officers యొక్కవంతోపడవచ్చని administration కు warning యిస్తున్నాను. ఇంకొక విషయము— State Advisory Committee అనేటటువంటిది ఒకటి ఉంది. గవర్నమెంటు ఆఫ్ ఇండియా సూచనల ప్రకారం ఏర్పాటు చేయబడినది. N. G. O. ల కేసులు ఈ కమిటీకి నివేదిస్తారు. ఇందులో పబ్లిక్ సర్వీస్ కమిషన్ చైర్‌మన్, ఛీఫ్ సెక్రటరీ, ఇంకొకరు ఉంటున్నారు. తెలంగాణాలోప్రస్తుత వాతావరణంచాలా suspiciousగా ఉంది. ఇది చూస్తేనాకు భయంగా ఉంటోంది. ఎందుకో నాకు తెలియదు కాని — యిటు తెలంగాణా ఆఫీసర్లు, అటు ఆంధ్ర ఆఫీసర్లు మాట్లాడడానికి కూడ భయపడుతున్నారు. Victimization జరుగుతున్నదా అన్న భావంతో ఆఫీసర్లందరూ ఉన్నారు. ఈ విధముగా ఆఫీసర్లు ఉండడము నేనిదివరకెన్నడూ చూడలేదు. అటువంటప్పుడు State Advisory Committee లో ఆ ముగ్గురుతో పాటు యింకో తెలంగాణా సభ్యుని కూడ వేసినట్లయితే అనుమానాలకు ఆస్కారం ఉండకుండా ఉంటుంది. అవసరం అయితే ఈ నాలుగో సభ్యుని, నియామకం గురించి కేంద్ర ప్రభుత్వానికి నచ్చ చెప్పండి. వరంగల్లులో ఆయుర్వేద కాలేజీకి 15 వేల రూపాయలు, మేముపోతూపోతూ grant చేశాము. అదివరకు గవర్నమెంటుఆమోదించిన గ్రాంటులు ఎందుకు ఖర్చు పెట్ట లేదని అడుగుతున్నాను. మేము ప్రభుత్వంలోకి వచ్చినప్పుడు, రజాకార్ ప్రభుత్వ బిల్లులు pay చేశాము. మాజీప్రభుత్వంయొక్క Commitments కు గౌరవం యివ్వవలసిన బాధ్యత మాకు ఉన్నదని మేముగుర్తించాము. ఆ మాత్రం గుర్తించవలసిన పరిస్థితులలో వారు లేరా అని మనవి చేసుకొంటున్నాను. ఈ విషయాలన్ని స్థానిక పరిపాలన అమాత్యులైన శ్రీ బ్రహ్మానంద రెడ్డిగారికి విన్నవించుకొన్నాను. తరువాత ముఖ్య మంత్రిగారికి లెటరుకూడ వ్రాశాను. ఈ విషయాలన్నీ, ఈ సభా ముఖమున ఎందుకు చెబుతున్నానంటే—వ్యక్తి గతముగా, ఆ యా మంత్రులకు ఉత్తరాలు వ్రాసినప్పటికి పరిస్థితులలో యేమీ మార్పు రాలేదు, హృదయము, దహించుకొని పోయేటటువంటి స్థితిలో ఈ విషయాలను మనవి చేస్తున్నాను. ఆంధ్ర, తెలంగాణా విభేదాలను రెచ్చ గొట్టడం నా ఉద్దేశ్యమే కాదు. ఇటువంటి అన్యాయాలు జరుగుతున్నప్పుడు, బాధ్యత గల పార్టీలో సభ్యునిగా ఉన్న నేను, నా కర్తవ్యాన్ని నెర వేరుస్తున్నాననీ, విన్నవించుకొంటున్నాను. ఇక్కడ శక్రటేరియట్ స్టెనో గ్రాఫర్లు ఉన్నారు. దీనికి corresponding గా పోస్టులు ఆంధ్రలో లేవు. లేకపోతే వీళ్లను Superintendents లిస్టులో చూపించవలసిన అవసరంఉంది. ఇవన్నీచిన్నవిషయాలేకావచ్చును. కాని సర్వీసెస్‌కుసంబంధించిన విషయం. ఇందులో అన్యాయాలు జరుగుతున్నాయి. ఈ పరిస్థితి అంతా anti democratic గా ఉంది. నేను మాట్లాడుతున్నప్పుడు, భాషకొంత కటువుగా ఉండవచ్చు, కాని ఇది ఒట్టి విమర్శగా భావించడం కంటే

కనీసం దీని వెనుక ఉన్న బాధను గ్రహించమని కోరుతున్నాను. సేల్సు టాక్సు డిపార్టుమెంటులో , కొన్ని కాంక్రీట్ కేసులు, నేను చూపెట్టుటకు సిద్ధముగా ఉన్నాను గోపాలరెడ్డి గారు స్వయంగా పూనుకొని justice చేయుటకు వస్తే, వాటిని ఋజువు పరుస్తాను. ఈ విధముగా అన్ని డిపార్టుమెంట్సులోనూ జరుగుతున్నాయి సర్వీసెస్‌ను జాగ్రత్తగా చూచుకోవలసిన బాధ్యత, అవసరం ప్రభుత్వం పై యున్నదని మనవి చేస్తున్నాను. ఈ సందర్భంలోనే ఈ సభకు కూడా ఒక విజ్ఞప్తి చేస్తున్నాను. M. L A. లు administration లో interfere కాలేరు. కాని M. L. A. లు కమిటీలుగా ఏర్పడి, యిటువంటి విషయాలన్నిటిని, సేకరించి, విచారించి ప్రభుత్వ దృష్టికి తీసుకొని రావలసిన అవసరం ఉన్నది ఈపరిస్థితులే ఈ విధంగా యికముందు కూడా కొనసాగుట ప్రజా స్వామ్యానికి అంత మంచిది కాదు పదే పదే ఈ విషయాలను ప్రభుత్వదృష్టికి తీసుకొని వస్తున్నప్పుడు దానిని సరిజేయవలసిన బాధ్యత ప్రభుత్వంపై యున్నది. సేక్సుపియరు అన్నట్లు కుక్కను కొట్టగా, కొట్టగా అది కరచి ఊరుకొంటుంది. ఇటువంటి చిన్న చిన్న విషయాలే పెద్దవిగా మారే ప్రమాదం ఉంటుంది.

అదే విధముగా తెలంగాణా శక్రటేరియట్ అసోసియేషన్ ఉంది. ఇప్పుడు దానిని ఆంధ్ర శక్రటేరియట్ యూనియన్‌తో గాని, లేదా District unions తోగాని affiliate కావాలని అంటున్నారు. అలా అనవలసిన అవసరం ఏమి వచ్చింది affiliation వల్ల fighting character తీసివేయగల్గమని అనుకొంటున్నారా ? అదే నిజమైతే సరియైన పద్ధతి కాదని తెలియ జేస్తున్నాను. తెలంగాణా యూనియన్ వాళ్ళ ఏమి చెబుతారో విని, అది ఆచరణ సాధ్యం అయితే ఆచరించండి. లేకపోతే ఊరుకోండి అంతేగాని వాళ్లను, ఏదో సంఘంతో affiliate అవమని చెప్పడం భావ్యం కాదు. ఈ వాడు , ఈ ప్రభుత్వానికి తెలియకుండా ఒక పెద్ద ఉప్పెనలాంటి గాలి వస్తోంది. ప్రభుత్వ పక్ష సభ్యుడుగా నా బాధ్యతను నేను , నెరవేర్చ వలసిన అవసరం ఉన్నది. అందుకనే ఈ విషయాలు ప్రభుత్వ దృష్టికి తీసుకొని వచ్చాను.

As a protogonist of Visalandhra, I feel, I brought this Government and therefore it is my duty to Protect Telangana brothern whereever they are and I have to do that part.

ఇది నాకర్తవ్యము కాబట్టి చెబుతున్నాను. తెలంగాణాయొక్క Per capital income, Per capita expenditure, హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలను మినహాయించి figures ను అందజేయవలసినదిగా కోరుచున్నాను. హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలను commonగా enjoy చేస్తున్నాము. దాని అభి వృద్ధికి ఆంధ్ర తెలంగాణాలు సమానంగా భరించాలి. ఈ లెక్కలను కూడా త్వరలో సభముందుఉంచిన అనుమానాలకు ఆస్కారములేకుండా ఉంటుంది. ఈ అవకాశం యిచ్చినందులకు అధ్యక్షులకు ధన్యవాదములు సమర్పిస్తున్నాను.

శ్రీ బి. జి. యమ్. ఎ. నరసింగరావు (కణితి) :—అధ్యక్షా, ఆంధ్ర ప్రదేశ రాష్ట్రం వచ్చిన తరువాత ప్రప్రథమంగా ఈ మిగులు బడ్జెటును ప్రవేశ పెట్టినందుకు చాలా సంతోషంగా వుంది. ఇందుకు శ్రీ గోపాల రెడ్డిగారిని అభినందించాలి. ఇటువంటి శుభ సమయములో , యింత వరకు చాలా అసంతృప్తి

కరమైన చర్చ జరగడం నిజంగా విచారాన్ని కలిగిస్తోంది ఈ సందర్భంలో ప్రతి పక్ష సభ్యులు చాలా Considerate suggestions చేశారు. ప్రభుత్వ పక్ష సభ్యులే, ప్రతి పక్ష సభ్యుల వలె చర్చ సాగిస్తున్నారనిపిస్తోంది. దేశం మొత్తం మీద జరుగుతున్న కృషి ఆంధ్రదేశములోను జరుగుతోంది. ఆకృషిని విశాల దృక్పధంతో సమీక్ష చేయడానికి బదులు సంకుచిత దృష్టితో యింకా మనం చూస్తుంటే మనం యే యుగంలో వున్నామో నాకు అర్థం కావడం లేదు చిన్న చిన్న విషయాలను ఏబ్రహ్మాండమైన దృష్టితో ప్రజల ముందు వుంచేట్లు, యీ సమావేశంలో చెప్పకోవడం, ఈ సభ యొక్క గౌరవ ప్రతిష్టలనుయినుమడింప జేస్తాయో, లేక తగ్గిస్తాయో ఆలోచించాలి. ఈ బడ్జెట్ సమావేశంలో కొందరు సోదర సభ్యులు, తెలంగాణా ప్రాంతానికి ఏదో అపకారం జరుగుతున్నట్లు ఏదో భయంకర వాతావరణం సృష్టించబడుతున్నట్లు చెప్పారు నిజంగా మన ముఖ్య మంత్రిగారు తెలంగాణా ప్రాంతానికి యిచ్చిన హామీలను యావత్తూకూడా, ఆంధ్రప్రాంతం వారికి ఎన్ని ఇబ్బందులున్నా, తమ మాట ప్రకారం నిలబెట్టుకొంటున్నారని నేను నమ్మకంగా చెప్పగలను ఆంధ్ర Services లో అనేక మందికి అపకారం జరిగిందని ఆందోళన వుంది. అందులో ముఖ్యంగా Law Department లో officers అందరు ఎక్కువ seniority వున్నవారు integration అయిన తర్వాత juniors గా అయిపోయారు. ఇదే విధంగాఅనేక Services లో తెలంగాణా లో వుండే Junior officers కు ఆంధ్రలోని Senior officers కంటె ఎక్కువ జీతాలు వస్తున్నాయని ఆందోళన పడుతున్నా వారిని సహించి వూరుకోమని శ్రీ సంజీవరెడ్డి ఇచ్చిన సలహా నాకు బాగా తెలుసు. అదే విధంగా కొందరు ఆంధ్ర శాసన సభ్యులు,ఆంధ్ర ప్రజా యావత్తూ, integration వల్ల ఆంధ్రప్రాంతానికి తీరనిఅన్యాయం జరిగిందని ఆందోళన చేస్తే శ్రీ సంజీవరెడ్డి తాము తెలంగాణా వారికి కొన్ని హామీలు యిచ్చామనియు, వాటిని చెల్లించి తీర వలసిందేనని చెప్పారు. అటువంటి నిష్పక్ష పాత వ్యక్తి దక్షత వహించిన ప్రభుత్వం పైన ఆరోపణలు సాగించడం చాలా బాధకరము, విచార కరము. ఇప్పటికైనా సభ్యులు విశాల దృక్పధంతో, విశాల భావాలతో, ఈ పరిస్థితి నంతా సమీక్షిస్తే చాలా బాగుంటుంది. తెలుగులో ఒక సామెత వుంది. ఒక సారి మంత్రి చేసిన వారు నరమాంసం రక్తం రుచిచూసిన సింహం వూరుకోలేవు. అని ఈ నాడు కూడా ఈ చర్చ అదే పద్ధతిలో సాగుతోందేమోనని నా అనుమానం.

డాక్టర్ యమ్. చెన్నారెడ్డి:—శ్రీ రాజలింగంగారు బాధ పడుతూ అన్న మాటలే తప్ప మరేమీ కాదని నేను మనవి చేస్తున్నాను.

శ్రీ బి. జి. యమ్. ఎ. నరసింగరావు:—మా విశాఖజిల్లాలో నాలుగు జీవనదులున్నాయి. వాటిలో ఏ ఒక్క దాని మీద Irrigation facilities కానీ, వంతెనలు కానీ, లేవు. ఇదిచాలా విచారకరమైన విషయం. ముఖ్యంగా Major Irrigation Projectsకు ప్రాముఖ్యతయిచ్చి, Minor Projectsను నిర్లక్ష్యం చేయడం భావ్యం కాదని ప్రభుత్వానికి సూచన చేస్తున్నాను. కనీసం శ్రీకాకుళం విశాఖజిల్లాలకు చెరో కోటి రూపాయలు యిచ్చినట్లయితే, అక్కడ వుండే Minor Projects పూర్తియి ప్రజలు చాలా సంతోషిస్తారని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను. రెండవ ప్రణాళిక కాలంలో యావన్మందికి 25% real income increase చేస్తామని చెప్పారు. కార్మికుల real income ను ఏ విధంగా increase చేస్తారో సూచన కాని, ఒక ప్రణాళిక కాని ప్రభుత్వం ముందు

వున్నట్లు ప్రభుత్వ మేమీ చెప్పలేదు. అందుచేత ఈ రెండవ ప్రణాళికా కాలంలో కార్మికులకు వుపకరించే లాగ ప్రభుత్వం ఇచ్చిన హామీని నిలబెట్టుకోమని కోరుతున్నాను. భారత ప్రభుత్వ ం సోషలిష్టు సమాజ స్థాపనకు చేస్తున్న కృషి చాలా అపారమైనది భారత దేశం యింత త్వరిత గతిని ఈ అభివృద్ధిని సాధించిం దంటే చాలా మంది ఆశ్చర్య పడుతున్నారు నేనీమధ్య బ్రిటన్ , అమెరికా, కెనడా మొదలైన యూరప్ దేశాల్లో పర్యటించి వచ్చాను. అక్కడ ప్రతి చోట భారతదేశం ప్రజా స్వామ్య పద్ధతిలో కొనసాగిస్తున్న అభివృద్ధిని కొనియాడుతున్నారు. భారతదేశం సోషలిష్టు సమాజ గమ్యాన్ని అతి త్వరలో చేరుకోవడానికి బ్యాంకులను , Life Insurance Corporation ను, తదితర సంస్థలను జాతీయం చేస్తోంది. ఇటువంటి తరుణంలో మనం దీనిని గుర్తించి, ప్రభుత్వానికి అన్నివిషయాల్లోను సహాయంచేసి సరైన పంథాలో నడుస్తున్న ప్రభుత్వానికి అన్ని రంగాల్లోను సహకరించి వారు కొనసాగిస్తున్న కార్యక్రమా లను జయప్రదం చేయవలసిన బాధ్యత మనందరి మీద వున్నది. ఇప్పుడు మన ప్రభుత్వం కొనసాగిస్తున్న చిన్న మొత్తాల పొదుపు ఉద్యమాన్ని, బ్రిటిష్ హయాంలో వారు వసూలు చేసిన war fund తో పోలుస్తూ కొంత మంది సభ్యులు విమర్శించారు. ఈ విధంగా విమర్శించడం చాలా శోచనీయం. అసెంబ్లీ సభ్యులు యావన్ మంది యీ కార్య క్రమ సాఫల్యానికి తోడ్పడతారని ఆశిస్తున్నాను.

శ్రీ బసవ మానయ్య (అందోలు) :—అధ్యక్షా, Budget విషయములో, శ్రీ గోపాల రెడ్డి గారి, గంభీర ఉపన్యాసం, పాండిత్యం మొదలైన విషయాల మట్టుకే ప్రశంసించదగినవి ప్రస్తుతం మన ప్రపంచ వ్యవస్థ, వినోబాభావేగారు చెప్పినట్లు, పగటి వేషాలలో నరసింహ అవతారం దాల్చినట్లుగా గోచ రిస్తున్నది. Budget ప్రతిపాదనలో , ఏ విధమైన క్రొత్త పన్నులు తిరిగి ప్రవేశ పెట్ట పోవడంలేదని చెప్పారు. కాని తెర వెనుక భాగవతము మాదిరిగా జరిగిన విషయాలన్నీ, డాక్టర్ చెన్నారెడ్డిగారి గంభీర ఉపన్యాసం ద్వారా అందరికి తెలిసి పోయింది. అదే విధంగా , శ్రీ నాయక్ గారు, శ్రీ కొత్తూరి సీతయ్య గుప్త, నరసింగరావు, శ్రీ క్రిష ంరాజ బహద్దూర్ గారలు వేరే బిల్లులపై ఉపన్యసిస్తూవారి, వారి నియో జక వర్గాలలో పనులు సక్రమంగా జరగడం లేదని, ప్రభుత్వం యొక్క వ్యవస్థ సరిగ్గా లేదని చెప్పారు. మొత్తానికి ఈ ప్రభుత్వం చేస్తున్న పనులను హర్షించేవారు సమర్థించేవారు ఒక్కరు కూడ కనపడడం లేదు. జానెడు పొట్టకు చాలిన తిండిలేక, తెల్లవారురూామున నాలుగు గంటల నుండి శ్రమ పడి మల మల మాడిలోకాన్ని బ్రతికించే కూలీల, రైతుల తినుబండారాల మీద పన్నులనుతీసివేసే విషయము ఆలోచించక, చంద్రమండలం, స్పుట్నిక్‌లగురించి చర్చించుకోవడం ప్రజలకు ఏవిధంగా ప్రయోజనకరమోగుర్తించాలి. ఇక, తెలంగాణావారి హక్కులను సంరక్షించేందుకు ఏర్పాటుకావలసిన సంఘం సరిగ్గా ఇప్పటికి ఒక సంవత్సరం అయిన తరువాత వారికి జ్ఞాపకానికి వచ్చింది. ఎందువల్ల ఈ ఆలస్యము జరిగిందా అని దీర్ఘంగా ఆలోచిస్తే తెర వెనుక భాగవతం ముందుకు వస్తుంది. ఈ ఒక్క సంవత్సరం లోపల అన్నీ Key Posts లోను సంపూర్ణంగా పదహారు అణాలు వాళ్లమనుష్యులనే వేసుకోవడం జరిగింది. I.G.P, Chief Secretary, Public Service Commission Chairman, Legislature Secretary, వీళ్ళంతా అక్కడి వాళ్లే. ఇంతకు ముందు ఆ post లను నిర్వహించే తెలంగాణా వారిని మార్చి యీ విధంగా re-posting చెయ్యడం జరిగింది. ఇక్కడే ఈ విధంగా జరుగుతుంటే జిల్లా

స్థాయిలో ఏమేమి జరుగుతున్నవో మీరే ఊహించుకోవచ్చు మొత్తంమీద తెలంగాణానికి ఏక్కడా స్థానం లేకుండా చేశారు.

ఇక ఖర్చుల కేటాయింపు ఏ విధంగా ఉన్నదో పరిశీలించాలని మనవి చేస్తున్నాను. No. 29 Police Accounts క్రింద 159 పేజీలో '. . . . High Commissioner for India' కు తొమ్మిది వేల రూపాయలు ఖర్చు చూపించారు. England లో ఉండే మన High Commissioner' కు మన ఆంధ్రప్రదేశ్ Budget నుండి కేటాయించడంలో వారి ఉద్దేశ్యం ఏమిటో అర్థంకావడం లేదు అవి, ఇవి, అనే ఖర్చులు ప్రతి పద్దులో కొన్ని వేలకు, కోట్లకు, మించి పోతున్నవి. స్థానికంగా ఈ ప్రణాళికలన్నీ పల్లెటూర్లలో జీవించే రైతాంగానికి సంబంధించినవని, వారి ఉద్ధరణకు ఉపయోగపడుతవని, అందరూ ఒప్పుకున్నప్పుడు, వీటి ఖర్చుల క్రింద 202 కోట్ల రూపాయలు కేటాయించబడింది. ఇంత ముఖ్యమైన వాటికి ఈ స్వల్ప కేటాయింపుతో, త్వరిత గతిని ముందుకు పోలే మనే విషయం దృఢ పడుతున్నది.

మన దేశనాయకుడైన జవహర్‌లాల్ నెహ్రూ ప్రపంచం అంతా తిరిగి ఎంతో కష్టపడి,డబ్బును అప్పుగా తీసుకు వచ్చి దేశాన్ని రెండవ పంచవర్ష ప్రణాళికలో , ముందుకు తీసుకు పోవడానికి శ్రమపడు తుంటే, ఆ ప్రణాళికలను అమలు జరుపడంలో మనం వెనుకకు పోతున్నామని చెప్పక తప్పదు. అంతే కాకుండ, 1956—57 సంవత్సరంకన్న, ఈ 1958—59 సంవత్సరంలో ఈ ప్రణాళికం అమలుకు డబ్బు తక్కువగా కేటాయింపు చేశారు.

ఎందువల్ల ఇలా చేశారో కారణం తెలియడంలేదు.

కె. సి. కెనాలు విషయములో అక్కడ మనడబ్బు ఏవిధంగా దుర్వినియోగం అయినదో శ్రీగోపాల రావు ఎక్బోటేగారి Report లో చూపించబడింది. 50 వేలరూపాయలు, చెట్లునాటడానికి లెక్కలలో చూపించారు, కాని అక్కడ చెట్లు లేనేలేవు. 24 Bridges కట్టడానికి కొన్నిలక్షల రూపాయలు లెక్కచూపిస్తే Bridges కు బదులు బళ్ళు బోర్లపడేలాగు పెద్దపెద్ద డొంకలు ఉన్నాయి. సిమ్మెంటు అంతాదుర్వినియోగం జరిగిందని ఆరునెలలవరకు అక్కడ పని నిలుపుదలచేస్తే, తుదకు మూడు కోట్ల రూపాయలు దుర్వినియోగం జరిగిందని ప్రభుత్వానికి ప్రజలకు లాభంలేనటువంటి వ్యవస్థ ఏర్ప డిందని, వారి రిపోర్టులో స్పష్టంగా సూచించారు. దీనికి కారకులైనవారిని ఎందుకు పట్టుకోలేదో అర్థం కావడంలేదు. అంతేకాకుండా Mundra వ్యవహారానికి chagla committee ని ఏవిధంగా నియమిం చారో అదేవిధంగా ఒక కమిటీని, ప్రభుత్వం ఎందుకు వెయ్యదో తోచకుండావున్నది.

Account No. 8 Excise, (62 వ పేజీలో) 'Charges in England High Commissioner for India అని రెండువందల రూపాయల ఖర్చు చూపించారు ఎందువల్ల?

Governor's Salary అని నెలకు 5,500—రూపాయలు ఆయన Secretary కి Staff కు 87,000— రూపాయలు, Military Secretaryకి 17,000 రూపాయలు,Contingentes

క్రింద 83,000— రూపాయలు, వైద్యానికి 5,000—రూ తోటలు, ఇళ్ళు బాగుచెయ్యడానికి 26,000— సంవత్సరానికి ఇంత పెద్దమొత్తాలు గా ఎందుకు ఖర్చుపెట్టబడుతున్నది ? ప్రజలు, కూలీలు, రైతులుకష్టపడి సంపాదించినటువంటి డబ్బును ఈవిధంగా వినియోగిస్తున్నారంటే ఎంతవిచార కరం?

1957-58 సంవత్సరంలో Ministers pay 58,000 రూ ఉండగా ఈ 1958-59 ంవత్సరంలో 90,000 రూపాయలకు పెంచుకున్నారు. మహాత్మాగాంధి అయిదు నూర్లకన్న క్కువ తీసుకోకూడదన్నారు. ఇప్పుడు ఆ బోధను మంత్రులు ఎంత వరకు పాటిస్తున్నారో తెలియదు?

ఇది ఇలా ఉండగా 1958 లో ఇంటి అద్దె, Travelling Allowance మొదలైన వాటి క్రింద రు 1,90,800 లు చూపించగా 1959 లో రు 2,74,300 లకు పెంచుకున్నారు అనగా రు 84 వేలు ఎక్కువ చేసుకున్నారు. ప్రజల డబ్బును ఈ విధంగా ఇష్టానుసారంగా వారి యొక్క స్వార్థానికి వినియోగించుకుంటున్నారు అనేది మరువ కూడదని మనవి చేస్తున్నాను.

Political Prisoners అనే దాని క్రింద, "Mansab to Nizam Police, Silver Medal holders" అనే దాని క్రింద 13 లక్షల 12 వేల రూపాయలు ఖర్చుపెడుతున్నారు.

1957-58 కంటే 1958-59 లో భూమి శిస్తు 22 లక్షలకు పెరిగింది. అడవులపై 9 లక్షల వడ్డీపై 65 లక్షల, Police పై 16 లక్షలు. ముఖ్యంగా ఈ Police కు ఖర్చు పెంచడం అనేది చాల అపాయం. ఎందుకంటే, మా ప్రాంతంలో, లంచాలు తీసుకుంటున్నారని మంత్రి గారికి application ఇస్తే, తెల్లవారగానే ఆ ఇచ్చిన వారిని బేడీలువేసి తీసుకుపోయారు. అలాంటి వారికి ఇంకా ఈ 16 లక్షలు ఎందుకు?

శ్రీ పి. బాపయ్య (తిరువూరు) అధ్యక్షా :— మన ఆర్థిక మంత్రిగారు కొత్త పన్నులు ఏమీ లేకుండా మిగులు బడ్జెటు ప్రవేశపెట్టినందుకు చాలా సంతోషము. అయితే ఇప్పటికి 63 కోట్ల 66 లక్షలు రెవెన్యూ వస్తున్నది, ఇంకా నూరు కోట్ల దాకా కావలసి ఉన్నది వారి ఆలోచనలో కాబట్టి మూడు కొత్త పన్నులు వేస్తారేమోనని భయముగా ఉన్నది. పన్నులు ఇప్పుడే ఎక్కువగా ఉన్నవి కాబట్టి రైతుల మీదనైనా ఎక్కువ వెయ్యకుండా 100 కోట్లకు ఆలోచన చేయవలసినదని మనవిచేస్తున్నాను. బడ్జెటు ప్రవేశపెట్టడముతో ఏ ఏ పద్దులకింద ఎంతెంత ఖర్చుపెట్టి ఏ ఏ కొత్త పన్నులు చేస్తారోనని ప్రజలు చూస్తుఉంటారు. శాసన సభ్యులు తమ తమ నియోజక వర్గాలలో ఏ ఏ ఇరిగేషను సౌకర్యములు కలుగచేయబడతవి ఎక్కడెక్కడ ఆసుపత్రులు పెడతారో అవి చూస్తూ ఉంటాము. ఇది సహజము. మేము నియోజక వర్గాలకుపోతే ప్రజలు మమ్ములను యీ విషయాలే అడుగుతారు మొత్తము మీద బడ్జెటు అంతాబాగానే ఉన్నదిగాని మాతిరువూరు నియోజక వర్గం గురించి ఏమీలేదు. మా తాలూకాలో చాలా స్కీములు ఉన్నవి వెదుళ్లవాగు, రాకట్టు, కట్లేరు, కంభంపాడు ఇరిగేషను స్కీములకు Preliminary investigation, Detaile investigations అయిపోయినవి గాని ఈ బడ్జెటులో మాత్రం అవిలేవు

గత సంవత్సరం వెదుళ్ళ వాగు స్కీము బడ్జెటులో యున్నది. ఈ సారి అదికూడా లేదు. ఇది చాలా విచారకరము Revised subject లోనైనా తప్పక చేర్చవలయునని, మీద్వారా కోరుచున్నాను. బడ్జెటులో ముఖ్యముగా గ్రామాల అభివృద్ధికి వ్యవసాయం అభివృద్ధికి అవసరమయిన పద్దు విద్యుచ్ఛక్తి. ఈ సంవత్సరం యీ పద్దు క్రింద సగానికి సగం తగ్గించ బడింది ఇది చాలా విచారకరము. గత సంవత్సరం యీ పద్దు క్రింద యున్న 66 లక్షల ఖరీదు గల విస్సవేరు స్కీము ఇందులో లేదు. అతివృష్టి, అనావృష్టి వల్ల ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో ఎక్కువ నష్టం వచ్చిందని మంత్రిగారు వారి ఉపన్యాసములో చెప్పారు. కాని ఆ నష్టం పడ్డ ప్రాంతాలకు సహాయం చేసే విషయం వచ్చేటప్పటికి, కొన్ని ప్రాంతాలలో శిస్తులు తగ్గిస్తారని కొన్ని చోట్ల బకాయిలు ఆపు చేస్తారని అన్నారు. ఈ సౌకర్యములు అన్ని ప్రాంతాలకు కలుగ చెయ్యలేదు. ఈ సంవత్సరం అతివృష్టి వల్ల అనావృష్టి వల్ల నా నియోజక వర్గంలో చాలా నష్టం సంభవించింది. ఈ విషయం ఆలోచించ కోరుతాను. తెలంగాణాలో కొన్ని తక్కావీ అప్పులు రద్దు చేసినారు. కొన్నింటికి వడ్డీ తగ్గించడము, కొన్ని ఋణాలకు పీనలు వడ్డీ రద్దు చేయడం జరిగినది. పీనల వడ్డీ అధికముగా ఉన్నది. రూ. 500— తీసుకున్న వారు రూ 700— రూలు. 800— చెల్లించవలసి వస్తున్నది. కనీసము ఆంధ్ర ప్రాంతములో ఈ పీనలు వడ్డీ తీసివెయ్యడానికి ప్రయత్నించాలని కోరుచున్నాను.

ఆంధ్ర ప్రదేశ్ వచ్చిన తరువాత కళా వెంకటరావుగారు బడ్జెటు ప్రవేశ పెడుతూ భూసంస్కరణల విషయము చెప్పేరు. అందుచేత అవి త్వరలో వస్తాయి అనుకున్నాము. ఇంతవరకు రానేలేదు ఈ బడ్జెటులో ఆ విషయము చెప్పనే లేదు. అంతేకాదు. ఈ మధ్య ఆర్డినెన్సు ద్వారా 20 ఎకరాలకు మించిన భూమి ఉన్నవారి లెక్కలు అడిగినారు. ఇది ఎందుకో ఎవరికి తెలియదు. ఏదో రకమైన భూసంస్కరణలు వస్తవి అని పెద్ద, పెద్ద భూస్వాములు 20 ఎకరాలకు తక్కువ ఉండాలని తమ భూములను భార్యా పిల్లలకు వ్రాసి వేసినారు. దాని ఫలితముగా రిజిస్ట్రేషన్‌లు ఎన్నో జరిగినవి. రిజిస్ట్రేషను ఫీజువలన ప్రభుత్వానికి చాలా ఆదాయము వచ్చినది. ఇప్పడైనా ప్రభుత్వము వారు భూసంస్కరణలను తీసుకువచ్చి పేద రైతులకు సహాయము చెయ్య వలెనని కోరుచున్నాను. ఆ సంస్కరణ వలన ఏమీ లాభంలేనట్లు చెయ్యకుండా సక్రమముగా అమలు చేయవలెనని కోరుచున్నాను.

శ్రీ జె. కొండలరావు (వేమూరు) :—అధ్యక్షా, యీ రోజు మన ఆర్థిక మంత్రిగారు ప్రవేశ పెట్టిన బడ్జెటును బల పరుస్తూ కొన్ని విషయాలు మనవి చేసుకుంటున్నాను. మన పల్లె ప్రజలు స్థితిని గుర్తించి ముందుకు పోవాలనే బ్రహ్మాండమైన ఆశయాలతో యీ పంచవర్ష ప్రణాళికకార్యక్రమాలను రూపొందించి వాటిని అమలు పర్చాలనే ఉద్దేశముతో యీ బడ్జెట్ తయారు చేయబడినదని మనము యీ బడ్జెట్ చూచిన యెడల పూర్తిగా బోధపడుతుంది. కాని 7 సంవత్సరాల తరువాత, అనేక కోట్ల రూపాయలు మన భారత దేశములో ఖర్చు పెట్టిన తర్వాత మన ప్రజల స్థితి ఏ విధంగా ఉన్నదనే సంగతి మనము గుర్తించుకోవలసి వుంటుంది. ఈ నాడు మన బడ్జెట్టు యొక్క స్వరూపముచూచి వెళ్ళితే యీ బడ్జెట్టు ద్వారా బీద ప్రజానీకము యీ 7 సంవత్సరాలలో ఎంతవరకు అభివృద్ధిలోనికి వచ్చింది ? బీద ప్రజానీకం యొక్క జీవన పరిస్థితులు ఎంతవరకు అభివృద్ధి చెందినవనే విషయముకూడా మనము ఆలోచించాలి. 7 సంవత్సరముల ముందు ప్రజలు ఏ పరిస్థితులలో వుండిరో యీ నాడు కూడా

అదే పరిస్థితులలో వున్నారు కాని మన బడ్జెట్ చూచినట్లయితే రివెన్యూ ఆదాయము రెండు మూడు రెట్లు పెరిగి పోయింది కాని మన ప్రాంత ప్రజల పరిస్థితి యధాతథంగానే వుండి పోయింది. ప్రజల ఆదాయాన్ని పెంచడానికి తగిన అవకాశాలు కల్పించ కుండా వారి పై పన్నుల భారాన్ని వేస్తూవుంటే ఈప్రణాళికా కార్యక్రమాలకు పెద్ద ఆవరోధము కల్గుతుందని చెప్పుతున్నాను. ఈరోజు ముఖ్యంగా యీ సభావేదిక పై ఆంధ్రా తెలంగాణా విభేదాలు రావడము మన ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తుకు చాల ప్రమాద కరము పంచ వర్ష ప్రణాళికా కార్యక్రమాలకు పెద్ద నిరోధకము కాగలదని చెప్పక తప్పదు.

ఇటువంటి వాతావరణాన్ని ఇకముందు కల్పించకుండా మన ప్రభుత్వము తెలంగాణా సభ్యుల ఆశ యాలను, వాండ్ల ఉద్దేశ్యములను గ్రహించి ఇకముందు ఎట్టిఅనుమానాలకు అవకాశము కలుగకుండా చేయ డానికి తగినచర్యలు తీసుకుంటారని ఆశిస్తున్నాను. బీద ప్రజానీకము మీద పన్నులు వేసినట్లయితే ఇప్పటికే పన్నులచే కృషించిపోతూ వున్నటువంటి బీద ప్రజానీకము యీ బడ్జెట్టుతో అంగీకరించదు. ప్రజలు సహాక రిస్తేనే యీ పంచవర్ష ప్రణాళిక జయ ప్రదము కావడానికి వీలవుతుంది. మన ఆంధ్ర ప్రదేశ్‌లో ఎక్కువ అభివృద్ధి కార్యక్రమాలు ప్రవేశ పెట్టి కోట్ల కొలది డబ్బు ఖర్చు పెట్టుతున్నాము. కాబట్టిఇటువంటి విషయాలలో ఇంత డబ్బు ఖర్చు పెట్టుతూ వున్నా కూడా ప్రజలు ఎందుకు వ్యతిరేకిస్తున్నారో ప్రభుత్వం గ్రహించవలసిందిగా కోరుతున్నాను. ఉద్యోగస్తులు ఏ విధంగా యీ కార్యక్రమంలో పనిచేస్తున్నారనేవిష యము మనము గ్రహించ వలసి వుంటుంది. అయితే ఉద్యోగులు మనము ప్రజాస్వామ్యము లో ఉద్యోగము చేస్తున్నాము, మన క్యార క్రమము గురుతరమైనది, మనము బాధ్యతతో ప్రవర్తించాలి, భారతదేశము ముందుకు పోవాలంటే మనము బీద ప్రజానీకాన్ని దృష్టిలో వుంచుకొని పని చేయాలి అని అనుకోవడము లేదు. అధికారులు స్వలాభము కోసము, ఏదో విధంగా కార్యక్రమాలను నెరవేర్చాలనే ఉద్దేశంతో పని చేస్తున్నారు. ప్రజానీకము యొక్క శ్రేయస్సు దృష్టిలో పెట్టుకొని పని చేయడం లేదు. ప్రతి ఉద్యోగి కూడా యీనాడు తాను తీసుకొంటున్న ప్రతి పైసా కూడా బీద ప్రజలు కష్ట పడి సంపాదించి పన్నుల ద్వారా యిచ్చినటువంటి డబ్బు అని మాత్రము గ్రహించవలసిందని మనవి చేస్తున్నాను. మన కార్య క్రమము యొక్క విజయ మంతయూ అడ్మినిస్ట్రేషన్ పై ఆధారపడి యున్నది.

కాబట్టి యీ విషయాన్ని ప్రభుత్వం దృష్టిలో వుంచుకొని సక్రమమైన పరిపాలనా నిర్వాహణకుప్రభుత్వం నమ్మకమైన కార్యక్రమాలు రూపొందించాలని మనవి చేస్తున్నాను. ఈనాడు తెలంగాణా పరిస్థితుల గురించి కొద్దిగా చెప్పవలసి ఉన్నది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడుటకు ముందు సూత్రాలను, రూల్స్ అండ్ రెగ్యులే షన్స్‌ను, ఆక్కను ఆతురతతో చేయడం జరిగింది. ఖమ్మం జిల్లాలోని మా నియోజక వర్గములో 70 మైళ్లకు కూడా ఒక ఆస్పత్రి లేదు. ఆ గ్రామాలకు రహదారి సౌకర్యాలు లేవు. వైద్య సౌకర్యాలు లేవు. తెలంగాణాలో ప్రజలు అనేక బాధలకు గురి ఔతూ వుంటే పన్నుల ద్వారా వసూలు చేసే డబ్బును ఖర్చు పెట్టడంలో సరియైనపద్ధతులనవలంబించడం లేదనిస్పష్టమౌతోంతెలంగాణాలోది30సంవత్సరములక్రిందట సర్వే జరిగింది. యీ 30 సంవత్సరములలో వ్యవసాయము అభివృద్ధి చెందినది. అనేక బంజర్లు సాగు లోనికి తీసుకు రాబడినాయి. కాని రీసర్వే, రీసెటల్ మెంటు లేక పోవడము వల్ల సరిహద్దు తగాదాలకు రివెన్యూ వసూలుకు కూడా భంగము కలగడానికి అవకాశముంది. కాబట్టి తెలంగాణాలో రిసర్వే రిసెటల్ మెంట్ జరిగినట్లయితే ఇటువంటి లాండ్ డిస్ప్యూట్స్ లేకుండా వుండడానికి అవకాశముంటుందనిమనవి

చేస్తున్నాను. ఇక రిజిస్ట్రేషన్ విధానము చూచినట్లయితే తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాలకు చాల తేడా ఉన్నది. తెలంగాణాలో ఒక భూమిని కొన్నవాడు అమ్మినవాడు ఇద్దరు కలిసి డిప్యూటీ కలెక్టర్ దగ్గర కెళ్లి స్టేట్‌మెంట్స్ యిచ్చిన తర్వాత ఎంతో డబ్బు ఖర్చు పెట్టుకొన్న తర్వాత, అనేక కష్టాలకు గురి అయిన తర్వాత ఆయన వారికి పర్మిషన్ యిస్తాడు. ఇది కొన్ని నెలలు పడుతుంది. ఇన్ని కష్టాలుపడి, ఇంత డబ్బు ఖర్చు పెట్టుకున్న తర్వాత కాని రిజిస్టర్ చేసుకోడానికి అవకాశముండదు. తెలంగాణాలో యీ లాండ్ రిఫార్మ్సను దృష్టిలో పెట్టుకొని కొన్నిలక్షల ఎకరాలు అమ్ముకోవడము జరిగింది ఒక్కటికూడా రిజిస్టర్ కాలేదు. అందువల్ల ప్రభుత్వానికి కొన్ని లక్షల రూపాయలు నష్టం వస్తున్నది. వారికి సివిల్‌కేసుల్లేవు. సాదా అగ్రిమెంట్ల మీద స్వాధీనము చేసుకోవడము జరుగుతున్నది. కాబట్టి ఆంధ్రలో ఉన్న రెజిస్ట్రేషన్ విధానము తెలంగాణాలో ప్రవేశ పెట్టాలని కోరుతున్నాను. అది కాకుండా ఇక్కడి గ్రామోద్యోగుల పరిస్థితులు కూడా చాల జాగ్రత్తగా ఆలోచించవలసి వుంటుంది. పటేల్, పట్వారీలు 10 గ్రామాలకు స్వంతదారులుగా వుండడము జరుగుతోంది. వారు గుమాస్తాలను అపాయింట్‌చేసి వారిద్వారా కార్యక్రమాలను నెరవేర్చు కుంటున్నారు. యీ గుమాస్తాల వలన ప్రజలకు చాలా కష్టాలు కలుగుతాయి. కనుక ఈ పటేల్, పట్వారీ విధానము ఆంధ్రలోనివిధానముతో సమన్వయ పరచమని కోరుతున్నాను. మాతెలంగాణా ప్రాంతములోని లాండ్ రిఫార్మ్సను గురించి మాట్లాడవలసి వుంటుంది. మా హైదరాబాద్ ప్రభుత్వ ముండగా లాండ్ రిఫార్మ్స్ మా ఖమ్మంజిల్లాలో వచ్చినాయి. అప్పుడు టెనెన్సీ ఆక్టులో 53 వ సెక్షన్ ప్రకారము మా ప్రాంతములో 40—50 వేల ఎకరాల భూమి బీద ప్రజానీకానికి యివ్వడానికి అవకాశముంటుందని చెప్పినారు. రెండు మూడు సంవత్సరాలైన తర్వాత నాలుగు వేల ఎకరాలు మాత్రమే బీద ప్రజానీకానికి యివ్వడానికి వీలుందని చెప్పినారు. ఈ నాడు క్రొత్తగా వచ్చే సీలింగ్ ఆక్టుప్రకారము ప్రొటెక్టెడ్ టెనెంట్స్‌గా గుర్తించబడిన వాండ్లు భూములను భూస్వాములకు వదలి వేయ వలసిన ప్రమాదము ఏర్పడుతుంది. మా తెలంగాణాలో ఇప్పుడు వున్న 3460 రూ. ఆదాయమును 5600 పెంచినట్లయితే రైతులు భూములను వదలుకొని భూస్వాములకు స్వాధీనము చేసేటటువంటి ప్రమాదము కూడా వుంది. కనుక యీ లాండ్ రిఫార్మ్స్ పెట్టేముందు సరిగా ఆలోచించి సక్రమంగా అమలు చేస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

•

శ్రీ బి. శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెం—జనరల్) :—అధ్యక్షా, మన ఆర్థిక మంత్రిగారు 1958—59 వ సంవత్సరానికి బడ్జెటును ప్రవేశ పెట్టుతూ యీ సంవత్సరము కొత్తగా పన్నులు వేసే ప్రమాదము ఏమీ ఉండదని అన్నారు, కాని ఇది నిజమైన విషయము కాదు. ఇది నిజమో, అబద్ధమో, ఇటీవల ప్రభుత్వము ప్యాసు చేసినటువంటి బిల్లులే విరూపించగలవు. 1958—59 వ సంవత్సరములో ప్రజలు ఇదివరకటికంటే ఎక్కువ పన్నులు కట్టవలసి వచ్చినప్పుడు, దీని యొక్క నిజ స్థితి బైటపడుతుంది. ఇక్కడ రాష్ట్ర ప్రభుత్వము విధించిన పన్నులు గాని, అక్కడ కేంద్ర ప్రభుత్వము విధించిన పన్నులు గాని ఆంధ్రప్రదేశ్ ప్రజలు 1958—59 వ సంవత్సరములో చెల్లించేటప్పుడు యీ పన్నులు ఎంత ఎక్కువ చేయబడినవో ప్రజలే తెలుసుకోగలరు. అందువల్ల ఆర్థిక మంత్రిగారు ఈ సంవత్సరానికి ప్రజల మీదకొత్తగా పన్నుల భారము ఉండదు అని చెప్పడము న్యాయంకాదు. ఇప్పుడు ఈ బడ్జెటు సందర్భములో మంత్రిగారు ఏమి చెప్పినప్పటికినీ, ప్రజలు పన్నులు చెల్లించవలసి వచ్చేటప్పుడు దీని నిజా నిజాలు తెలుసుకో గలుగుతారు.

గత సంవత్సరము బడ్జెటును ప్రవేశ పెట్టినప్పుడే మన రివెన్యూ మంత్రి కళా వెంకట్రావు గారు ఈ సంవత్సరము బడ్జెటు సమయములో భూసంస్కరణలను ప్రవేశ పెట్టటానికి బిల్లును శాసన సభలో ప్రతిపాదిస్తానని అన్నారు. అవి ఇంతవరకు ప్రవేశపెట్ట బడనేలేదు పోనీ ఈ బడ్జెటు ప్రసంగ ములో నైనా ఆర్థిక మంత్రిగారు చెప్పలేదు ఈ సంవత్సరము మార్చి నెలలో భూసంస్కరణల బిల్లును ప్రభుత్వము ప్రవేశ పెట్టబోతుందని ప్రజలు ఎంతో ఆశతో ఎదురు చూస్తూ వచ్చారు. ఈ సంస్కరణ లకు వ్యతిరేక ప్రచారముకూడా సాగుతున్నది రైతుల వద్ద నున్న భూములన్నీ ప్రభుత్వము పంచి పెట్ట బోతుందనిన్నీ, నిర్భంధసహకార వ్యవసాయ పద్ధతిని అమలు జరుప బోతుందని, ప్రచారము సాగిస్తు న్నారు. అలాంటి ప్రచారము చేయకుండా, ప్రజల నిరుత్సాహమును పోగొట్టటానికి ప్రభుత్వము కనీసము యీ బడ్జెటు ప్రవేశ పెట్టేటప్పుడైనా వారు చేయబోవు కార్యక్రమమునుగాని, వారి పాలసీని గురించిగాని చెప్పలేదు. భూసంస్కరణల వల్ల పేద రైతులకు కలుగబోవుప్రయోజనములను గురించి, భూస్వాముల వద్దనున్న మిగులు భూములను యీ విధముగా పంచి, వ్యవసాయమును అభివృద్ధి పరచుటకు ఈ విధా నమును అవలంభించ బోతున్నాము, నిర్భంధ సహకార వ్యవసాయము అనేది యేమీ లేదని చెప్పి, ప్రజలలో కలిగిన అందోళనలు, భయోత్పాదములు తీర్చటానికి ప్రభుత్వము తలపెట్టలేదు. భూసంస్కరణలు త్వర లో ప్రవేశ పెట్టవలసిందిగా ప్లానింగు కమిషను వారు, ప్రభుత్వానికి పంపిన ఆదేశములు, అఖిల భారత కాంగ్రెసుపార్టీవారు చేసిన తీర్మానములు మనకు,ప్రజలకు అందరికీ తెలిసినవిషయమే. భూసంస్కరణలను ప్రవేశపెట్టటానికి జరుగుతున్నటువంటిఆలస్యమును బట్టి,రెవిన్యూమంత్రి కళా వెంకటావుగారికి ఇష్టము లేనట్లు ప్రజలలో అనుమానములు కలుగుతున్నవి. అలాంటి అనుమానములకు అవకాశము ఇవ్వవచ్చునా అని ప్రభుత్వాన్నిఅడుగుతున్నాను. ఎందువల్ల ఆలస్యముజరుగుతున్నదో, దీనికి కారణములు, వీటి యొక్క సాధకబాధకములు మంత్రిగారు ఒక్కసారి అయినా ప్రజలకు ప్రచారానికివచ్చి నప్పుడైనా బహిరంగసభలు పెట్టినప్పుడైనా వెల్లడించలేదు. ఈ సంస్కరణలవల్ల పేదరైతులకు ఎంతో లాభించగలదని ఆశ పెట్టు కున్నారు. ఇంతవరకు ఒక్కసారి అయినను రెవిన్యూ మంత్రిగారు ప్రకటన ద్వారా నైనా యీ భూసంస్క రణల వల్ల కలుగు లాభ నష్టములను గురించి చెప్పి ఉన్నట్లయితే బాగుండేది. ప్రజలకు ఉన్న అనుమాన ములు తీరేవి. కాబట్టి ఇప్పటికైనా రెవిన్యూ మంత్రిగారు యీ భూసంస్కరణలను ఎప్పుడు ప్రవేశ పెట్ట బోతారో చెప్పవలసిందిగా కోరుతున్నాను. తెలంగాణాలో అదివరకే భూగరిష్ఠ, కనిష్ఠ పరిమితులను నిర్ణ యిస్తూ శాసనము చేయబడింది. కాని అది సక్రమముగా అమలు జరగడములేదు. దీనివల్ల అనేక చిక్కులు ఏర్పడుతున్నవి. భూసంస్కరణలవల్ల కలిగే లాభం ఏమిటో, వీటిని గురించిప్రభుత్వము యొక్క పాలసీ ఏమిటో, ప్రజలకు సరిగా అర్థముకాక పోవడమువల్ల, భూస్వాములు తమ భూములు కౌలుకు చేసే రైతులను భూములనుండి వెళ్లగొట్ట నారంభించారు. ఇప్పటికే ఎంతో మందిని వెళ్లగొట్టి స్వంత కమతము సాగించుచున్నారు. ఇటీవల ప్రభుత్వము ఇరవై ఎకరాలకు పైనఉన్న భూస్వాములనులెక్కలు పంప మని చేసిన ఉత్తరువులు అందినప్పటినుంచి, భూస్వాములు బినామీ పంపకాలు చేసియున్నారు. ప్రభుత్వానికి ఇచ్చిన లెక్కలు సరియైనవి కావు. వీటిని గురించి సరియైన దర్యాప్తు చేయవలసి ఉంటుంది. ప్రభుత్వము యొక్క పాలసీ యేమిటో ఒక్క సారి ప్రజలకు నచ్చ చెప్పినట్లయితే, కనీసము భూములనుండి సాగుచేసే రైతులను వెళ్లగొట్టకుండ ఉండటానికి ఆస్కారము ఉంటుంది. ప్రభుత్వము త్వరలో యీ విషయ మును గురించి ఒక ప్రకటన చేస్తారని ఆశిస్తున్నాను. మనకు స్వతంత్రము వచ్చి, కాంగ్రెసు ప్రభుత్వము

అధికారంలోనికి వచ్చి ఇప్పటికి పది సంవత్సరములు కావచ్చింది. పరాయి ప్రభుత్వాన్ని వెళ్ళగొట్టి కాంగ్రెసు ప్రభుత్వము ప్రజలకు ఏమో మేలు చేస్తుందని అనుకొన్నారు కాని, ఏమీ కల్పించలేదు. ఇటీవల ఈనాము రద్దు శాసనము అని చెప్పి ఇనాము భూములను రైత్వారీ భూములుగా మార్చే శాసనము ప్యాసు చేశారు కాని దీని వల్ల కలిగిన ప్రయోజనము ఏమిటంటే, ఎన్నో సంవత్సరములుగా సాగు చేస్తున్న లక్షల మంది పేద రైతులను భూములనుంచి వెళ్ళగొట్టటానికి అవకాశము కలుగ జేసింది. ఇదివరకు ఎకరము ఒక్కటికి మూడు, నాలుగు రూపాయలు శిస్తు రైతులు కట్టుతూ ఉండేవారు. అలాంటిది యీ రద్దు శాసనము వల్ల ఎకరానికి ఎనిమిది, పది బస్తాల చొప్పున ధాన్యము ఈనాందార్లకు ఇవ్వవలసి వచ్చింది ఇవ్వనటువంటి చోట్ల, మీరు ధాన్యము ఇవ్వలేదు గనుక యీ భూమినుంచి నిన్ను ఎందుకు తొలగించకూడదు అనే విధముగా నోటీసులు యిస్తున్నారు ఈ విధముగా జరిగిన ఘటనలు మా నెల్లూరు జిల్లాలో అనేకములున్నవి ఈ విషయము మన ఆర్థిక మంత్రిగారికి తెలుసు ప్రభుత్వానికికూడా తెలుసు. భూస్వాములు ఇలాంటి నోటీసులు జారీ చేస్తున్నారు దీనిని అరికట్టించాలి. రైతులకు తగిన రక్షణ యివ్వాలి అని deputations ద్వారా, తీర్మానాల ద్వారా ప్రభుత్వము దృష్టికి తేవడము జరిగింది. కాని ప్రభుత్వము ఏలాంటి చర్య తీసుకోలేదు. ఎన్నో సంవత్సరములుగా సాగుచేస్తున్నటువంటి రైతులను వెళ్లగొట్టి, ఆ భూములను రాజకీయ బాధితులకు ఇవ్వాలని ప్రభుత్వము ఆలోచిస్తున్నది. కాని, ఈ విధముగా చేయడము న్యాయము కాదు. ఈ సందర్భములో నేనొక ఉదాహరణ ప్రభుత్వము దృష్టికి తెస్తున్నాను. మా నియోజక వర్గములో వావిళ్ల అనే గ్రామమున్నది. అక్కడ సుమారు మూడువందల ఎకరాల వరకు రైతులు 14, 15, సంవత్సరములుగా సాగుచేసుకొంటున్నారు. ఆ రైతులను తొలగించటానికి సిద్ధపడుతున్నారు. ఈ విషయము అన్యాయమని ప్రభుత్వము దృష్టికి గూడ తేవడమైంది. దీని నిజ పరిస్థితి ప్రభుత్వానికి తెలియక పోలేదు. అలాంటి అన్యాయములు జరుగకుండా ప్రభుత్వము చర్య తీసుకోలేదు. ఇలాంటి భూములు మా జిల్లాలో సుమారు పదివేల ఎకరములదాకా ఉంటాయి.

మా జిల్లాలో ఎక్కువ భాగము జమీందారీ ప్రదేశము. పూర్వము జమీందార్ల హయాములో ఎన్నో చెరువులు ఏర్పడినవి. అవి అన్నీ ఇప్పుడు శిథిలావస్థలో ఉన్నవి. అవి బాగు చేయించలేదు. ఈ విషయములన్నీ పరిశీలించి ఒక రిపోర్టు పంపమని ప్రభుత్వము కోరినప్పటికినీ, అసలు ఈ విషయమును గురించి పరిశీలనే జరుగలేదు. పేదరైతులు సాగుచేసుకుంటుంటే, ప్రభుత్వోద్యోగస్థులు ఎకరానికి 80 రూపాయల దాకా penalties వేస్తున్నారు. penalties వేయకుండా ప్రభుత్వము ఉత్తరువులు ఇచ్చినప్పటికినీ, ప్రభుత్వోద్యోగస్తులు అవి సరిగా అర్థము చేసుకోవక, యీ విధమైన ఉత్తరువుల ప్రభుత్వము ఇచ్చిందని చెప్పినప్పటికినీ, penalties వేస్తూనే ఉన్నారు. ఈ మాదిరి heavy penalties రైతులు కట్టలేక పోతున్నారు. రైతులయందు ప్రభుత్వము సానుభూతి చూపించి, యీ penalties ను రద్దు చేయవలసిందిగా కోరుతున్నాను.

తరువాత irrigation విషయముచూస్తే ప్రభుత్వము దీని క్రింద అనేక విధములుగా ఖర్చు చేస్తున్నదే కాని, అది ప్రజలకు ఏ విధముగాను ఉపయోగ పడడము లేదు. మా జిల్లాలో అల్లూరు స్కీము అని ఉన్నది. ఆస్కీమును అమలు పరచటానికి 13 లక్షల ఖర్చుకు ప్రభుత్వం అంగీకరించింది. అది ఆపుజేసి, మరల investigate చేయాలని అన్నారు. ఈస్కీము అమలుపరచకపోయినట్లయితే, దీని

క్రింద సుమారు మూడువేల ఎకరములదాకా ప్రతి సంవత్సరము మునిగిపోతున్నది. రైతులు నష్టపడు తారు ఈ స్కీము అమలు పరచి నట్లయితే ఇది వరకున్న భూమికాక, ఇంకా రెండు వేల ఎకరాలు సాగు చేయటానికి వీలు అవుతుంది. ఈ స్కీమువల్ల ఉలవపాళ్ల, సింగపేట, అల్లూరు, రైతులందరు ప్రయోజనము పొందగలరు. ఇది చాలా ముఖ్యమైన స్కీము. ప్రస్తుతము యీ స్కీము. క్రింద 15,20 వేల రూపాయలు అయినా ఖర్చు చేసినట్లయితే, కనీసము వేంకొలది ఎకరముల భూమి మునిగి పోకుండా నైనా అవకాశము ఉంటుంది తక్కువ ఖర్చుతో ఎక్కువ ప్రయోజనము పొందగల అవకాశమున్నది. పంట కూడ ఎక్కువగా పండించవచ్చు ఈ విషయమును ప్రభుత్వము దృష్టికి తెచ్చినాను, ప్రభుత్వము పట్టించు కోవడము లేదు . కావలి, కనుపూరు కాలువల విషయములో ప్రభుత్వము ఒక కోటి అరవై లక్షల దాకా ఖర్చు చేయదలచుకున్నది. ఇలాంటి పెద్ద స్కీము ఇంత తక్కువ ఖర్చుతో తయారు చేస్తున్నారంటే, ఇలాంటిది మరొకటి కాదని చెప్పవచ్చు. ఈ కాలువలు త్వరలో పూర్తికాక పోవటము వల్ల నీరు అంతా వృధాగా పోతున్నది. ఇవి త్వరలో పూర్తి చేస్తే దీనికి సంబంధించిన చెరువులలోనీరు నింపటానికి వీలు అవు తుంది. దీనిని త్వరలో పూర్తి చేయిస్తారని ఆశిస్తున్నాను. నాగార్జున సాగర్ప్రాజెక్టులో ఒక భాగమైన సోమశిల ప్రాజెక్టు విషయములో Diversion Barrage ని కట్టి, తక్షణము కాలువలు త్రవ్వి వట్లయితే, ఆత్మకూరు తాలూకాలోని చెరువులకు అన్నింటికి నీరు నింపటానికి వీలు అవుతుందని దీనిని త్వరలో పూర్తి చేయించమని ప్రజలు కోరుతున్నారు. ప్రభుత్వము ఎట్లాగైనా డబ్బు ఖర్చు చేయదలచు కున్నది. గనుక ఈ స్కీములను త్వరలో పూర్తి చేయిస్తే ప్రజలకు ఉపయోగపడుతాయి.

రాష్ట్రములో చిన్న చిన్న పరిశ్రమలు ప్రస్తుత పరిస్థితిని బట్టిచూస్తే చాలా క్షీణ దశలో ఉన్నట్లు కన్పిస్తున్నది మా జిల్లాకు సంబంధించినంతవరకు చేనేత పరిశ్రమ చాలా ముఖ్యమైన పరిశ్రమ. కేంద్ర ప్రభుత్వమువారు సెస్సు ఫండును ఏర్పాటు చేసి, చేనేతవారికి ఆర్థికంగా సహాయపడుతున్నారు. తగిన మార్కెటింగ్ సౌకర్యాలు లేవు. ఇదివరకు మద్రాసునుంచి చేనేత బట్ట పోయేది. ఇప్పుడు ఆంధ్ర రాష్ట్రము ఏర్పడినతరువాత తగిన సౌకర్యాలు కలుగ జేయలేదు. కో-ఆపరేటివ్ సొసైటీస్‌లో చేరితేగాని సెస్‌ఫండ్ క్రింద బెనిఫిట్ వచ్చే వీలు లేకుండా ఉన్నది. అది స్థాపిం చటమనేది బ్రహ్మాండమైన పనిగా ఉన్నది. సహకార సంస్థల ద్వారా చేతిపనులు వృద్ధి చేయాలని కొన్ని లక్షల రూపాయలు ఖర్చు పెట్టుతున్నారు. పాత చట్టము, పాత పద్ధతులు మార్చకుండా ఇన్ని లక్షలు ఖర్చు పెట్టాలంటే సాధ్యమైన విషయంకాదు. సహకార చట్టాన్ని సవరించక పోవటంవల్ల చాలా ఇబ్బందులు కలుగుతున్నాయి. ఉద్యోగస్తులు సొసైటీలను రిజిస్టరు చేస్తే చేస్తున్నారు. లేకపోతే మానే స్తున్నారు. సభ్యులను చేర్చుకోమంటే, అంతకు ముందు ఉన్న సభ్యులు ఇష్టపడితే చేర్చుకుంటున్నారు, లేకపోతే లేదు. ఆర్థికమంత్రిగారు మా జిల్లాలో జరిగిన సహకార మహా సభలో పాల్గొని చెప్పారు. సహకార సంఘాలలో అందరూ చేరే అవకాశం ఉండాలన్నారు. చేనేత సహకార ఉద్యమంద్వారా, ప్రభుత్వం నుంచి వచ్చే సహాయం అందరూ పొందే అవకాశం కలుగ జేయాలని వారుచెప్పారు. కాని ఆ యాక్టులో మార్పులు తెస్తున్నారా అంటే తేవటం లేదు. సెంట్రల్ బ్యాంక్ ఎన్నికలు కూడా జరుపుట లేదు. ఎన్నో అన్యాయములు జరుగుతున్నవి. 1 1/2 సంవత్సరముల క్రితం సెంట్రల్ బ్యాంక్ రిజల్యూషన్ పాస్‌చేసి అధ్యక్షుని ద్వారా తెలియ జేశారు. కాని ప్రభుత్వము ఆలోచిస్తున్నదని, వారు చెప్పేవరకు రిజిస్ట్రారు ఏమీ చేయమని నిలిపి పెట్టారు. మెంబర్షిప్ విషయంలో వారు కాదన్న వారు బయటికి పోవాలి, దొంగ

మెంబర్సును తెస్తే ఒప్పుకోవాలి. ప్రభుత్వానికి తెలియజేసినప్పటికీ విచారణ జరుపుటలేదు. చట్టము సవరించాలి. ఎన్ని సార్లు ప్రభుత్వ దృష్టికి తెచ్చినా నిర్లక్ష్యము చేస్తున్నది ప్రజలు బాధపడుచున్నారు

అక్కడ ఒకపెద్ద గ్రామంలో ఉన్న స్కూలుకు యిటీవల రికగ్నిషను రద్దు చేశామన్నారు. ఆ స్కూలులో అయిదుగురు ఉపాధ్యాయులు , 120 కి పైగా విద్యార్థులు ఉన్నారు ఏదో manager లోటు చేసినాడని, అధికారులు వెళ్లినప్పుడు కనపడలేదని recognition రద్దుచేశారు. ఆ పిల్లంగతి ఏమి కావాలి ? D. E. O ను వచ్చి విచారించి చూడమని అయిదారు నెలలనుంచి కోరినా రావటంలేదు. అక్కడ ఇండ్లు బాగుచేయించి ఉపాధ్యాయులను ఉండమని యిచ్చారు కాని ప్రభుత్వం ఏమీ చర్య తీసుకొనుటలేదు. ఈ విధంగా పరిపాలన సరిగా జరగకుండాపోతున్నది

కో-ఆపరేటివ్ సొసైటీలు రిజిస్టరు కావాలంటే , ఎవరైనా సిఫారసుచేసి 'వద్దు' అంటే రిజిస్టరు చేయుటలేదు. మాజీ, చెట్లు గీసుకొనేవారు సహకార సంఘాలు పెట్టుకుంటామని, నాలుగయిదు గ్రామస్థులు కలసి డబ్బుకట్టి రిజిస్టరు చేయమంటే చేయటంలేదు అయిదు మైళ్ళ దూరంలో ఎక్కడో ఉన్న కోవూరులో చేరమంటున్నారు. ఈ విధంగా పరిపాలన లోపభూయిష్టంగా ఉన్నది. ఇవి నివరించటానికి ప్రభుత్వం చర్య తీసుకోవాలని, భూముల విషయంలో ప్రభుత్వం సరైన శ్రద్ధ తీసుకోవాలని కోరుతూ ముగిస్తున్నాను.

శ్రీ కె. కోటిరెడ్డి (లక్కిరెడ్డిపల్లి)—అధ్యక్షా, ఆర్థికమంత్రిగారు ప్రవేశ పెట్టిన ఈ బడ్జెటును సమర్థిస్తూ కొన్ని విషయాలు చెప్పదలచుకొన్నాను. మొట్ట మొదట ఈ ఆంధ్ర, తెలంగాణా అనే పదముల గురించి చెబుతాను. రాను రాను ఆంధ్రదేశము—అంటే తెలంగాణా చేరేదేమోననే అభిప్రాయము మనము యిప్పుడు ఉపయోగించే పదాలను బట్టి ఏర్పడుతోంది. అది నిలుపుదల చేయటానికి యిప్పటినుంచి ప్రయత్నముచేయాలని నా అభిప్రాయము. తెలంగాణాకూడా ఆంధ్రలో చేరినదే. తెలంగాణా సోదరుల అభిప్రాయాన్ని బట్టి ఈ విశాలాంధ్ర దేశానికి ఆంధ్రప్రదేశ్ అని పేరు పెట్ట వలసివచ్చింది. బహుశా 'ప్రదేశ్' అనేది మార్చేసి 'ఆంధ్ర స్టేట్' అని చేయవలసి వస్తుందేమో. 1929 సంవత్సరంలో సీడెడ్ డిస్ట్రిక్ట్సు అనబడే కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం జిల్లాలకు రాయల సీమ — అని పేరు పెట్టాము. కొన్ని సంవత్సరాలయిన తరువాత 'రాయల సీమ' అనే పేరు గవర్నమెంటు రికార్డ్సులో కూడా ఎక్కింది. బాగా అలవాటయిపోయినది. అదే విధంగా Coastal Districts కు 'సాగర సీమ' — అంటే సరిపోతుందని నా అభిప్రాయం. 'ఆంధ్ర' —అంటే మొత్తము విశాలాంధ్ర అని అర్థము చేసుకోవాలి. ఆ విధంగా యీ పదములను మార్పుచేయాలని నామనవి.

తెలంగాణా సోదరులకు అనేక విషయాలలో అన్యాయం జరుగుతున్నదని ఈ అసెంబ్లీలో చెప్పారు. నేను ఆ విషయం గురించి స్టడీ చేయలేదుగాని అటువంటి అన్యాయాలు జరిగి ఉంటే శీఘ్రంగా మన మంత్రులు ఆలోచించి అటువంటివి లేకుండా చేయాలని నా అభిప్రాయం . ప్రభుత్వము తరపున యిచ్చిన హామీలు వెంటనే ఆచరణలో ఉంచటానికి ఎలాంటి లోపము ఉండదని నా అభిప్రాయం

ఒక విషయంలో యీ బడ్జెటుకు నా అమోదము పూర్తిగా ఉన్నదని చెప్పగలను . అది మోటారు ట్రాన్స్‌పోర్టు విషయం. మద్రాసు Composite State లో 1946 సంవత్సరములో Bus Transport జాతీయం చేయాలని అనుకొన్నారు. అయితే కొన్ని సంవత్సరములయిన తరువాత ఏస్వల్ప భాగములోనో తప్ప అది ఆచరణలో రాలేదు మన అదృష్టం వల్ల పూర్వపు హైదరాబాదు ప్రభుత్వం క్రింద Bus Transport తెలంగాణా అంతా ఉన్నది ఆంధ్ర కలిసిన తరువాత దీనిని యితర చోట్లకు వ్యాపింప చేయుటకు ప్రభుత్వం శ్రద్ధ తీసుకొంటుంన్నందుకు చాలా సంతోషం. అనేక సంవత్సరాలుగా ఈ విషయమై నేను ఆతురత పడుతూ ఉన్నాను. అప్పుడప్పుడు నేను బస్ లో ప్రయాణము చేయవలసిన అవసరం ఉంటుంది. దినదినమూ జరిగే ప్రమాదాలు చూస్తే మనస్సు చాలా వ్యాకుల పడుతుంది కర్నూలు జిల్లాలో ఉన్నప్పుడు నా స్నేహితులు ఒకరు టాక్సీలో నెల్లూరు వెళ్లి నెల్లూరునుంచి మద్రాసుకు బస్సులో పోవలసి వచ్చింది. వారు బస్సు ప్రమాదములో ప్రాణములు కోల్పోయారు. వారు ఇప్పుడు ఉండియుంటే శ్రీవెంకటేశ్వర యూనివర్సిటీలో ప్రముఖపాత్ర నిర్వహించగలిగియుండేవారు. అప్పటి సందర్భంలో నేను గవర్నమెంటువారికి మంత్రిగా కూడా ఉంటూ కొన్ని instructions ఫలాని విధంగా చేస్తే బాగుంటుందనిపంపాను వాటి enforcement సక్రమంగాజరుగలేదు. ఇకలారీల విషయంచూస్తే అవి ఎంతో వేగంగా నడుపబడుతున్నాయి. రోడ్డు మీద వెళ్లే సైకిల్సుకు, మోటార్సుకు ఏమి ప్రమాదం ఏర్పడుతుందో నని భయపడిన వారు ఉండరు రోడ్డు మీద నడచివెళ్లే వారికి అపరిమితమైన భయంగా ఉంటుంది. ప్రజల యొక్క safety కే భంగం కలిగే విధంగా లారీలు నడుపబడుతున్నాయి.

బస్సు సర్వీసు ప్రజలయొక్క utility సర్వీసుగా ఉన్నది. దీనిని ప్రభుత్వం ఎంత త్వరగా నేషనలైజు చేస్తే అంత మేలు చేసినవారు అవుతారు బస్సులు నేషనలైజు చేస్తే కొంతమంది ప్రైవేట్ ఓనర్సుకు ఆర్థిక నష్టంకలుగుతుంది. వారికి ఆర్థిక నష్టంకలుగకుండా ప్రభుత్వం కొంత నష్టపరిహారం ఇవ్వక తప్పదనుకొంటాను ఈ సంవత్సరం కృష్ణా జిల్లాలో బస్సులు నేషనలైజు చేయటానికి ప్రభుత్వం నిర్ణయించినందుకు చాలాసంతోషము. తక్కిన జిల్లాలలో కూడా ఎంత శీఘ్రంగా ఈ బస్సు సర్వీసు నేషనలైజు చేస్తే అంత బాగుంటుందని నా నమ్మకము. దానివల్ల ప్రజలకు safety కలగటమే కాకుండా , వారు పడే బాధలన్నీ పోగొట్టినట్లు అవుతుంది.

ఈ నాడు ప్రయివేటు బస్సు సర్వీసు వల్ల ప్రజలు పడుతున్న బాధలు చెప్ప నక్కరలేదు. డ్రయివర్స్ అనవసరంగా హెచ్చుకాలం ప్రతిచోటా బస్సులు నిలపటం , చాలా వేగంగా బస్సులు నడపటం జరుగుతున్నది. పాసింజర్సును over take చేసుకోవాలనే ఉద్దేశంతో, ముందున్న బస్సును దాటుటకు చాలా వేగంగా బస్సులు నడుపుతున్నారు. నేను చాలా సార్లు డ్రైవర్సుకు చెప్పటం జరిగింది. కాని వారు నామాట గమనించలేదు.

ప్రయివేట్ బస్సులు నిలపటానికి సరైన స్టాండ్సు ఏర్పాటు చేయటంలేదు. పంచాయతీబోర్డులు కూడా స్టాండ్సు ఏర్పాటు చేయటం లేదు. ఎక్కడ చూసినా, బస్ స్టాండ్సు లేవు. ప్రభుత్వంవారు శీఘ్రంగా ఈ బస్సు సర్వీసుసు నేషనలైజు చేసి, త్వరలో ఆచరణలో పెట్టేదానికి ప్రయత్నము చేస్తారని ఆశిస్తున్నాను. మొత్తం అన్నిజిల్లాలలోను బస్సుసర్వీసు నేషనలైజు చేయుటకు ప్రభుత్వానికి financial difficulties ఉన్నవని నాకు తోచదు.

నేను కడప జిల్లాలో బస్సులను డిస్ట్రిక్టుబోర్డు ద్వారా నడిపించటానికి పూర్వం ప్రయత్నం చేసినాను. బస్సు ఒనర్సుతో సంప్రతించి "మీ బస్సులు మీరు నడుపు కోండి, వాటి కంట్రోలు డిస్ట్రిక్ట్ బోర్డుకు ఇవ్వండి" అని నేను చెప్పగా, దానికి వారు ఒప్పుకొన్నారు కాబట్టి అన్ని జిల్లాలలో బస్సు సర్వీసు నేషనలైజు చేయటానికి ప్రభుత్వానికి ఫైనాన్షియల్ డిఫికల్టీస్ ఉంటే, బస్సు ఒనర్సును పిలిచి, వారితో సంప్రతించి బస్సులను వారే నడుపుకొనునట్లు, వాటి పైన కంట్రోల్ ప్రభుత్వం తీసుకొనునట్లు నిర్ణయించి ఆ బస్సులు run చేసి, మైలుకు ఇంత, అని గవర్నమెంటు తీసుకొంటే సరిపోతుందని నా అభిప్రాయము.

ఇరిగేషన్, ఎలక్ట్రిసిటీ గురించి నేను కొన్ని విషయాలు చెప్పవలసి ఉన్నది. మెట్టప్రదేశంలోని అనేక మంది రైతులు తమకు ఎలక్ట్రి సిటీ ఎప్పుడు వస్తుందా, ఇరిగేషన్ సౌకర్యాలు ఎప్పుడు వస్తాయాఅని ఎదురుచూస్తున్నారు. డెల్టా ప్రాంతపు ప్రజలను చూచి మెట్టప్రదేశంలోని రైతులు బాధ పడుతున్నారు. రాయలసీమ ప్రాంతంలో నీరు లేక, 2, 3 సంవత్సరాలనుండి పంటలు చాలా భాగం పోయాయని చెప్పవచ్చును. "మాకు ఇరిగేషన్ సౌకర్యాలు ఎప్పుడు వస్తాయి, మాకు నీరు ఎప్పుడు అందజేస్తారు" అని రాయలసీమ ప్రజలు అడుగుతున్నారు. రాయలసీమకు నీటిసరఫరా గురించి, ఇరిగేషన్ సౌకర్యాలు గురించి ఆంధ్రాస్టేటులో కొన్ని ప్రపోజల్సు వేశారు. ఈ విశాలాంధ్ర స్టేటులో, ఆ ప్రపోజల్స్ ప్రకారం జరగటం లేదు. గవర్నమెంటు ఆఫ్ ఇండియావారు మనకు అధికంగా లోన్ ఇవ్వక పోవటం చేత, మన ప్రపోజల్సు అమలు జరుగుటలేదని నా నమ్మకము. పెద్ద పెద్ద స్కీములు లేకుండా ఇప్పుడున్న స్కీములతోనే రాయలసీమకు నీరు అందించవచ్చునని నా నమ్మకము. ఇది వరకు కంపోజిట్ స్టేట్‌లో ఈ ఎలక్ట్రి సిటీ గురించి ఎంక్వయరీ చేయబడింది—శ్రీశైలం దగ్గర ఒక పెద్ద dam కడితే చాలా ఎలక్ట్రిసిటీ సప్లయిచేయవచ్చును. గవర్నమెంట్ దాని విషయంలో శ్రద్ధ తీసుకొని, ఆ dam కట్టించి, ఎలక్ట్రిసిటీ రైతులకు సప్లయిచేయాలని నా మనవి.

రాయలసీమ జిల్లాలలో శాశ్వతంగా ఉన్న కరువు బాధ అందరికీ తెలిసినదే. అక్కడ నీరు లేకుండా ఉండి—నీటికొరకు ప్రజలు ఆతురతపడుతున్నారు. ఇప్పుడున్న కే. సి. కెనాల్‌కు ప్రభుత్వం చాలా డబ్బు ఖర్చు పెట్టారు. దానికి పెట్టిన డబ్బు చాలదు. ఇంకా 4 కోట్లయినా ఖర్చు పెడితేగాని పూర్తి ఫలితం పొందలేమని అక్కడి ప్రజల అభిప్రాయమై ఉన్నది.

రెండవది, హై లెవల్ కెనాల్ ఉన్నది. మనం ఒక పెద్ద dam కట్టాము. రాయలసీమ జిల్లాలకు నీరువస్తుందని అనుకొన్నాము. కాని స్వల్ప ఏరియాకు మాత్రమే నీరు వచ్చింది—20 కోట్లు ఖర్చు పెడితే, 50 లక్షల ఎకరాలకు మాత్రమే నీరు వచ్చింది—ఈ ప్రకారంగా అయితే, ఎన్ని సంవత్సరాలకు యీ జిల్లాలు బాగుపడతాయో అర్థంకాదు. రాయలసీమ జిల్లాలలో కరువు బాధ పోగొట్టటానికి ప్రయత్నం చేయాలి. అక్కడ famine-conditions ఉన్నాయి. కాబట్టి ప్రభుత్వం ఎక్కువగా డబ్బు ప్రొవైడ్ చేస్తేనే త్వరగా పని అవుతుంది. అందుకు ప్రభుత్వం త్వరగా చర్యలు తీసుకోవాలని కోరుతూ, మీరు ఈ అవకాశం ఇచ్చినందుకు ధన్యవాదాలు తెలుపుతున్నాను.

శ్రీ టి. జాలయ్య (గుంటూరు):—అధ్యక్షా, ఆర్థికమంత్రిగారు ప్రవేశ పెట్టిన యీ "అంబర వీధి" అంచనాల మీద మాట్లాడటానికి సావకాశం ఈ రోజున నాకు దొరికినందుకు నేను సంతోషిస్తున్నాను. మన బడ్జెటు "అంబర వీధి"మీద తిరుగుటకు మన ఆర్థికమంత్రిగారు ఎంతో శ్రమ పడినందుకు నేను వారిని అభినందిస్తున్నాను.

ఈ బడ్జెటులోని హెచ్చు తగ్గులు గురించి, ఖర్చు పద్దులు గురించి నేను చెప్ప దలచుకోలేదు. ఎడ్మినిస్ట్రేషన్‌లో వెనకా ముందుకు సర్దుకోటానికి వీలుగా, సమయానుకూలంగా, ఖర్చు పెట్టటానికి అనుకూలంగా వారు బడ్జెటు తయారుచేసుకొన్నారు. ఇప్పుడు నేను వాటి గురించి చెప్పదలచుకోలేదు.

ముఖ్యంగా ఆంధ్రదేశంలో వరిపంట జాస్తీగా ఉన్నది. పండిన పంటను బయటకు పంపటానికి సావకాశంలేని ఆర్డర్సును కేంద్ర ప్రభుత్వంవారు ఇచ్చినారు. మొత్తం ఆదాయంలో సగం బియ్యంమీద సేల్సు టాక్స్ వల్ల, మాగాణి భూములమీద రెవిన్యూ టాక్స్ వల్ల, వసూలు అవుతోందని మన గవర్న మెంటుకు కూడా తెలుసు. బియ్యం మీద సేల్సు టాక్స్‌వల్ల దాదాపు 5, 6 కోట్ల రూపాయలు ఆదాయం వస్తున్నది. కాని పండిన పంట బయటకు పోవటానికి వీల్లేకుండా కేంద్రప్రభుత్వం సూచిం చింది. అందువల్ల మనరైతులు ఎంత బాధపడుతున్నారో మన ప్రభుత్వం గుర్తించి, కేంద్ర ప్రభుత్వంతో పోట్లాడుతున్నప్పటికి, కేంద్ర ప్రభుత్వం ఏ మాత్రం శ్రద్ధ తీసుకోకపోవటం చాలా శోచనీయంగా ఉన్నది. ఢిల్లీలో, శ్రీ జైన్ గారు, ఏదో రీసర్చి చేసినట్లు, ఆంధ్రులపైన లేని పోని నిందలు వేస్తూ, "ఆంధ్రులు తమఅభిప్రాయానికి భిన్నంగా నడుస్తున్నట్లు" ఉపన్యాసాలు చెబు తున్నారు. అది కేవలం అన్యాయం, అబద్ధమని చెబుతున్నాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—అన్యాయమని చెప్పండిగాని అబద్ధమని అనకండి— "అబద్ధం" అన్నది అన్‌పార్లమెంటరీ అవుతుంది.

శ్రీ టి. జాలయ్య:—అది అన్యాయమని ఒప్పుకొంటే చాలును. లక్షా, 50 వేల టన్నులు ఆంధ్రలో మిగులుతుందని కేంద్ర ప్రభుత్వం అంచనావేసి, 40 వేల టన్నులు మాత్రమే ఎగుమతి చేసు కోవటానికి పర్మిషన్ ఇచ్చింది. ఆ విధంగా చేయటంవల్ల ఆంధ్రరాష్ట్ర రైతుల పని ఏమి కావాలని కేంద్ర ప్రభుత్వము ఉద్దేశము ? ఇది అన్యాయంకాక, మరేమిటని అడుగుతున్నాను. తాను కొనక, బయ టకు ఎగుమతి చేసుకొనటానికి పర్మిషన్ ఇవ్వక, కేంద్రప్రభుత్వం ఆర్డర్ pass చేసి "ఆంధ్రప్రజలు, ఆంధ్ర వర్తకులు సహాయం చేయటంలేదు" అని చెప్పటం అన్యాయంకాక, మరి ఏమవుతుందో, మంత్రివర్గం ఆలోచించాలని కోరుతున్నాను. దీని విషయంలో, మన ముఖ్య మంత్రిగారు, చాలా సమయోచితంగా, కేంద్ర ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నారన్న సంగతిమేము వింటున్నాము.

అయితే ఈ చిక్కు ఇంతటితో తీరదు. ఇప్పుడు వర్తకుల వద్ద యాభై వేల టన్నుల సన్న ధాన్యము నిలువ వున్నది. మరల కొత్తపంట వచ్చింది. అది ఒక నలభై వేల టన్నులు నిలువ వున్నది. ఈ మొత్తము తొంభై వేల టన్నులధాన్యము బైటకుపోకపోతే, వర్తకుల పరిస్థితి ఏమికావాలి? వర్తకులు సరుకు నిలవ చేస్తే, బ్యాంకు అప్పు ఇవ్వరు. రైతుల వద్దనుంచి వర్తకులు కొంటే, ప్రభుత్వం అయినా కొనడం

లేదు. ఇలాంటి పరిస్థితులలో వ్యాపారస్తులు ఏమిచేయాలో అర్థము కావడము లేదు. కాబట్టి ముఖ్య మంత్రిగారు యీ విషయములో కొంత శ్రద్ధ వహించి ఎలాగైనా కేంద్ర ప్రభుత్వాన్ని వత్తిడి చేసి, ఏలాంటి నిర్బంధములు లేకుండా, వ్యాపారస్థులను తమ నిలవ సరుకులను అమ్ముకునేటట్లు చేస్తారని ఆశి స్తున్నాను. వారు కంకణము కట్టుకొని కేంద్రప్రభుత్వముతో పోరాడితేతప్ప, వ్యాపారస్థులు అనేక విధ ములుగా, నష్టపడతారని మనవి చేస్తున్నాము. సన్నబియ్యము జోన్ దాటి బైటకు పోగూడదం టున్నారు. ఇక పోతే వ్యాపారస్థులు కొన గలిగింది ముతక బియ్యమే. ఇది అన్ని చోట్లలో కొనరు. అందువల్ల సన్న బియ్యము విషయములో కేంద్రప్రభుత్వము వారు పెట్టిన నిబంధములను సడలించటానికి ప్రయత్నించవలసిందిగా ముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను.

ఇకపోతే, బడ్జెటును అంతా తిరగ వేసి చూస్తే, ఇందులో మా గుంటూరు మునిసిపాలిటీ Water scheme, Drainage scheme గురించి ఏమీ లేనే లేదు. ఈ సంవత్సరము Surplus Budget అంటున్నారు. కాబట్టి ఇలాంటి సమయములో నైనా మా గుంటూరు మునిసిపాలిటీకి ఉన్న యీస్కీముల కొరకు అయినా కొంత డబ్బు కేటాయించి ఉంటే బాగా ఉండేది. అలాంటిది ఏమీ జరుగ లేదు. గుంటూరు టౌనులో Water Schemeను ప్రారంభించారు. Water Scheme, Drainage Scheme, ఇవి రెండు త్వరలో పూర్తి చేయించకపోతే, రోగాలు వచ్చి, ప్రజలు చాలా బాధపడుతారు. ఇప్పటికే గుంటూరుటౌనులో ఏ epedemics వచ్చినా, చాలా జాస్తిగా వస్తూ ఉంటాయి. మునిసిపాలిటీకి ప్రభుత్వము డబ్బు ఇవ్వకపోతే, ఇక Municipal Administration ఏ విధముగా నడుస్తుందో ఆలోచించండి.

తరువాత గుంటూరుటౌనులో రైల్వే జంక్షను వద్ద ఒక బ్రిడ్జిని ఏర్పాటు చేయటానికి ఇప్పటికి ఇరవై సంవత్సరాల క్రిందటనే estimates తయారు అయినవి. అవి ప్రతి సంవత్సరము ఏదో ఒక విధ ముగా మార్పు చేయడము ఏదో తేడాలు ఉన్నవని చెప్పడము జరుగుతున్నది. చివరికి ఇన్ని సంవత్సరాలుగా ఆ బ్రిడ్జి కట్టనేలేదు. కాబట్టి మంత్రులైనవారు యీ సారి గుంటూరు visit చేసినప్పుడు, అక్కడ జనము రాకపోకలకు ఎలాంటి ఇబ్బంది కలుగుతున్నదో , జన సమ్మర్ధము ఏ విధముగ ఉన్నదో ఒక్కసారి పరిశీలించి వస్తే, నేను ఈ సందర్భములో చెప్పేటటువంటి సంగతులు అన్నీ విశదము కాగలవు.

తరువాత పరిశ్రమలను గురించి ఒక్కవిషయము ప్రభుత్వ దృష్టికి తేదలచాను. మన రాష్ట్ర ములో పరిశ్రమలనేవి ఏ మాత్రము అభివృద్ధిచెందడము లేదు. ప్రభుత్వము ఈ పరిశ్రమల విషయ ములో తగుశ్రద్ధ వహించాలి. పెద్ద పెద్ద పరిశ్రమలు ఏవీ లేవు సరికదా, చిన్న పరిశ్రమలైనా వృద్ధి చేయక పోతే ప్రజలు ఆర్థికంగా బాగుపడే అవకాశమే ఉండదు. Cottage Industries ను ఇతర రాష్ట్రాలలో ఎంతో వృద్ధికి తెచ్చుకొని డబ్బు సంపాదించుకొంటున్నారు. Chamber of commerce యొక్క సలహాలు ఇతర రాష్ట్రాలలో ఉన్న Chambers of commerce యొక్క సలహాలు తీసుకొని ఈ పరిశ్రమలను వృద్ధికి తేవలసిందిగా కోరుతున్నాను. ఇది గాక ఒక సలహా యివ్వ దలచాను. మనరాష్ట్రములో మైదా మిషీను లేదు. మద్రాసు రాష్ట్రములో ఏదోకొద్ది invistement తో మైదా మిషీను ఏర్పాటు చేసుకుని ఎంతో డబ్బు సంపాదించుకుంటున్నారు. ఆదే విధముగా మనఆంధ్ర ప్రదేశ్‌లో కూడ, కొన్ని లక్షల పెట్టుబడితో ఒక మైదా మిషీను ఏర్పాటు చేసుకొని మైదా తయారు

చేసుకుంటే, మనము ఇతర రాష్ట్రాల మీదగాని, విదేశాం మీద కాని ఆధారపడకుండా ఉండవచ్చు. విదేశాం మీద ఆధార పడితే, వాళ్ళు చెప్పిన ధరకు మనము కొనుక్కోవలసి ఉంటుంది మన రాష్ట్రములోనే దీనిని తయారు చేసుకుంటే, మనకు అది చాలా చౌకగా దొరికేటట్లు చేసుకోవచ్చు ఈ విషయముకూడ ఆలోచించవలసిందిగా కోరుతున్నాను.

తరువాత లఘు పరిశ్రమలు అని మంరొకస్కీము ఉన్నది. దీని ద్వారా తయారయ్యే వస్తువులను గురించి మద్రాసు రాష్ట్రములో గ్రామగామానికి propaganda జరుగుతున్నది. అదే విధముగా మన రాష్ట్రములో కూడ చేయాలని అంటున్నాను. ఈ పరిశ్రమలవల్ల, వృత్తి, ఉపాధులు దొరుకుతాయి

ఇంతేకాకుండా Sales tax విషయములో ఒక సంగతి మనవి చేస్తున్నాను ఈ సంవత్సరము Sales tax ద్వారా ఎనిమిది కోట్లు వచ్చింది. ఇంకా రావటానికి సావకాశము ఉన్నది. అది 15 కోట్లదాకా పెరగ వచ్చు. ఈ sales tax ను వర్తకులు ప్రోత్సాహిస్తునే ఉన్నారు కాని ఒక్క సంగతి మాత్రము గుర్తించాలి వర్తకులను tax పోష్టాఫీసులో కట్టమని అంటున్నారు. పైగా ఉద్యోగస్థుల ఒత్తిడి చాలా జాస్తిగా ఉన్నది. దీనివల్ల వర్తకులు అనేక యిబ్బందులకు గురి అవుతున్నారు. ఒకరికి ఇంత మంది ఉద్యోగస్తులను వేయడమువల్ల, ప్రభుత్వానికిడబ్బు రాకపోవడమేకాక దీనివల్ల వర్తకులకు ప్రభుత్వానికికూడా ఎంతో ఇబ్బందిగాఉన్నది. ప్రస్తుతము మన రివెన్యూ బోర్డు మెంబరు వి. వి. సుబ్రహ్మణ్యం గారు దీని విషయములో ఒక స్కీమును తయారు చేశారు. రాష్ట్రములో ఉన్న 800 మిల్లులలో ఇప్పటికి 6 సంవత్సరాలుగా అమలు జరుగుతున్న muster roll ను తెప్పించి, ఏ మిల్లు ఒక్కొక్కరోజుకు ఎంతెంత పని చేసింది particulars అన్నీ సేకరించి, అట్టలతో ఒక మేడ కట్టి, తన సలహాలతో, ఒక రిపోర్టున్ను,తయారు చేసి, అట్టలమేడను రిపోర్టుతో సహా ప్రభుత్వానికి అందజేసినట్లుగా తెలుస్తున్నది. ఆ అట్టలమేడపడి పోవడమే కాకుండా, ప్రభుత్వ administration కు కూడ భంగము కలుగుతుందని అభిప్రాయపడుతున్నాను. అలాంటి officers ను తొందర పడివేయకుండా, వారు ఇష్టము వచ్చిన విధానమును అవలంభించకుండా అరికట్టి administration ను సరియైన మార్గములో నడిపించటానికి ఆలోచించమని ప్రభుత్వాన్నికోరుతూ విరమిస్తున్నాను.

శ్రీ పి. పి. తిమ్మారెడ్డి (సర్వేల్) :—అధ్యక్షా, ఆర్థిక శాఖామాత్యులు యీ 1958—59వ సంవత్సరము surplus budget ను ప్రవేశ పెట్టినందులకు నేను వారిని సంతోష పూర్వకముగా అభినందిస్తున్నాను. ఈ బడ్జెటును చూచి అందరము ఆనందించవలసినదే. ఎందువల్లనంటే, ఇంతవరకు ప్రతి సంవత్సరముకూడా మనకు లోటు బడ్జెటే వస్తూ వచ్చింది. అలాంటిది యీ సంవత్సరము వారు ఏదో రూపములో డబ్బు మిగిల్చి surplus budget ను ప్రవేశ పెట్టారంటే, ఇది చాలా ఆనందదాయకమైన విషయము. అంతేకాకుండా ఇదివరకు మనకు లోటు బడ్జెటు గా ఉండి నందున మనకు ఏదైనా కావాలని అంటే, బడ్జెటు లోటుగా ఉన్నదని చెప్పకొనే అవకాశ మేర్పడియున్నది. కాని యీ సంవత్సరము మాత్రము అలాంటిది ఏమీ లేదు. పన్నులు ఎక్కువగా వేసిన కారణము చేత మనకు లోటు బడ్జెటు అనేది లేకుండా పోయింది. ప్రభుత్వము తను చేయదలచిన కార్యకలాపములకు వ్యయము

చేయుటానికి డబ్బు అవసరము గనుక, దానికి తగినంత వరకు పన్నులు అధికముగా వేయడము జరిగింది. ఆర్థిక శాఖామాత్యులు వ్యయములో కొంత డబ్బు మిగిల్చి, లోటు లేకుండా చేశారు. ప్రభుత్వానికి డబ్బు అవసరము. ఈ నాటి పరిస్థితులను బట్టి ప్రపంచములో లభ్యి పం. ములు విజ్ఞానమయమైనవి ఇప్పుడు మనము 20 వ శతాబ్దములో ఉన్నాము ఈ విజ్ఞానమంతా ఎగర సీమలో విహరిస్తూ యున్నది విజ్ఞానం మాత్రం కొన్ని సమయములలో వికసిస్తుందే కాని, భావాలను చూస్తే మాత్రము ఆకాశములో పోయే గ్రద్ద తన ఆహారము వంక తన దృష్టిని ఏ విధముగా కేంద్రీకరిస్తుందో అదేవిధముగా ఉద్దేశ్యాలన్నియు కూడ స్వార్థము వైపుకే పోతున్నవి ఈ రోజులలో ఎక్కడ చూచినా అవినీతి ప్రబలిపోతున్నది. ఇది అంద రికి తెలిసిన విషయమే. దీనికి కారణము ప్రభుత్వ యంత్రాంగము సక్రమ పంథాలో నడవటము లేదని చెప్పాలి. లంచగొండి తనాన్ని నివారిస్తాము అని చెప్పడమే కాని, ఇంతవరకు జరగలేదు. మనకు స్వతంత్రము కావాలని పోరాడి తెచ్చుకున్నాము కాని స్వాతంత్ర్యము కావాలని కోరేవారు తనవెంట బాధ్యతకూడ ఉంటుందనేది గుర్తించాలి అది గుర్తించినప్పుడే, ప్రజలలో నిజాయితీ అనేది పెరుగుతుంది కాని, లేకపోతే లేదు. బాధ్యత అనేది ప్రతి మనిషికీ ఉంటుంది. కాని ఇది ఎవ్వరు ఈ రోజులలో గుర్తించడములేదు ఎవరు ఈ బాధ్యతను గుర్తించేది ?

స్వధర్మేనం నిధర్మం శ్రేయః
పర ధర్మో భయావః

అనే సూత్రాన్ని ప్రతి మానవుడు కూడ అవలంభిస్తేతప్ప, లేకపోతే అది గుర్తించటానికి వీలు లేదు. నైతికపతనము దేశములోకి వచ్చేసింది.

దీనికికారణముఏమింటే, మనం ఈ రోజులలో ఎన్నోరకాలుగా, హాట్‌గా, ఘాట్‌గా, సూటిగా మాట్లాడుతున్నామేకాని మరి ఈమాట్లాడేమాటలయొక్క భావార్థాలుఏమిటి? నిజంగాచూస్తే ఎవరిభావా లతోవారుమాట్లాడుతున్నారు. అనగాప్రస్తుతముదేశము ఏలావున్నదంటేసృష్టిలోమానవులు వారికికవబడిన విధముగా వారిభావాలను వెల్లడిస్తున్నారు. అదేవిధముగా ప్రతిపక్షమువారు ప్రభుత్వము ఏమితప్పచేస్తుం దాలని ఎదురుచూస్తూ దానిపైన మాట్లాడుతున్నారు. ఏపార్టీకి సంబంధించినవారు ఆ పార్టీకున్న భావాలతో మాట్లాడుతున్నారు. ప్రాంతీయ భావాలుకలవారు వారిభావములను గురించి చెబుతున్నారు. ఈ విధముగామాట్లాడటానికి కారణమేమిటంటే వీరిలో ఒకరికొకరి మధ్య సామర స్యములేకపోవడమే. అయితేసామరస్యమనేది ఎట్లావస్తుంది ? మానవునికి, మానవునికి సామరస్యముకుదరటానికి వీలు అయితేనేగాని మరొకవిధముగా వీలుకాదు. దీనికంతటికీ మతములనేది ఒక ప్రాతిపదికగా ఉంటూవచ్చింది. పశుత్వమునుంచి మానవునిగా మార్చాలంటేగాని, మానవుని మాధవునిగా మార్చాలంటేగాని మతమేఒకకారణముగా వుంటూవచ్చింది. మతమునుగూర్చి మాట్లాడాలంటే ప్రజలు భయపడుతున్నారు. ఇదిఒక ఆవేశమని అనుకుంటున్నారు. కానిమతముఅనేదది మనకు అర్థమేమిటి. అది హిందూమతముకాదు. మహమ్మదీయమతముకాదు, భౌద్ధమతముకాదు. మరొకమతముకాదు. మతముఅనేది ఒకరస్తా. ఏమిటి ఆ రస్తా ? రస్తాఅనగా, ప్రపంచములో మానవుని జీవితము సరియైన దారిలో నడిపించేది. అంటే సరియైన విధానము అన్నమాట. అందువల్ల

అందరినీ సరియైన రస్తాలోకి మార్చటానికి తహతహలాడి పోతున్నారు. అలాంటి విధానము తెచ్చి అమలు పరచడము సాధ్యముకాదా ? దీనికొరకు ఈ బడ్జెటులో ఏమైనా కేటాయింపు ఉన్నదేమోనని చదివి చూచాను. అలాంటిది ఇందులో ఎక్కడను కన్పించదు. దేశములో మతసామరస్యం, అవినీతిని పార(దోలటానికి, అవినీతి పుట్టకుండునట్లు చేయుటకు మతము ఒక్కటే విధానం. ఇది చాల ముఖ్యమైనది గనుక, కేవలం కళాకారులు, మిగత ఆకారులు అందరికీ అవకాశము కలిగినటువంటి ఈ (ప్రపంచములో ధార్మికదృష్టికలవారికి (ప్రచారానికి అవకాశములేకుండా పో తున్నదంటే సత్యాన్ని మనము ఎంతవరకు అమలులో పెట్టగలిగామో అవిమనకే తెలుస్తూవున్నదిగదా. మతము, మతముల సామరస్యం రెండూకావాలంటాను. కాని ఏమతముగొప్పది, ఏమతము చిన్నది అనేవిష యముకాదు. ఎవరిమతమువారికిఉండవచ్చు. ఇతరులమతముకూడ అవలంబించవచ్చు. కానిదీనికి (ప్రచారము జరగాలి. లేకపోతే ఉపయోగములేదు మనది secular state అని అంటున్నారు పూర్వము మా(త్రము ఎవరి మతములు వారికి ఉండడములేదా ? అక్బరుకైములో కూడ అన్నిమతములు వున్నవి. అప్పుడుమా(త్రము అవిఉపయోగపడలేదా? ఆరోజులలో ఎవరిమతమును వారు బోధించుకోలేదా? మతసా మరస్యాన్ని అక్బరు సాధించ లేదా?

డాక్టర్ బి. గోపాలరెడ్డి.— ఆయన అన్నిమతములవారిని పెళ్ళిచేసుకున్నారు.

(శ్రీ సి. పి. తిమ్మారెడ్డి :—ఒకవైపునమతం అంటే భయపడుతూ మరోవైపున సంకుచిత భావాలకు వెడుతున్నారు. అటువంటప్పుడు పార్టీదృక్పథంఏమిటి? వ్యక్తిదృక్పథంఏమిటి? కులదృక్పథం ఏమిటి? ఇవన్నీ నీచాతినీచంగా కనబడుతున్నాయి. ఇటువంటి (ద్రోహం లోటుపాట్లు డిపార్టుమెంటు హెడ్సులోను, పరిపాలనపద్ధతులలోనే ఉంటే-అదంతా కుళ్ళుకాదా! ఈకుళ్ళును తీసివేయాలంటే సామ రస్యంపెంపొందాలి. మానవునికీ మానవునికీ తేడాలేదనే భావం కలిగినట్లయితే ఇటువంటి కుళ్ళు పెరగ టానికి అవకాశాలులేవు. అటువంటప్పుడు మతాన్ని ఎందుకు అమలులోనికి అభివృద్ధిలోనికి తేకూడదు?, సామరస్యాన్ని ఎందుకు పెంపొందించకూడదు? పాపభీతి ఎందువల్ల కలుగజేయకూడదు? వివేకం వైరాగ్యం, షట్కసంపత్తి, ముముక్షత్వం, కలుగునని శా(స్త్రాలు ఉద్బోధించడం లేదా?

మిస్టర్ స్పీకర్:— నెల్లూరు town—hall లో ఇవ్వవలసిన ఉపన్యాసాలు ఇక్కడఇస్తే ఎట్లా?

(శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి:— హైదరాబాదుకూడ పెద్ద town. ఇంకాకొంచెం సేపుమాట్లాడ నివ్వండి.

(శ్రీ సి. పి. తిమ్మారెడ్డి:— ఉపనిషత్తులకు భాష్యం (వ్రాసిన తమరే ఇటువంటి విషయాలం మాట్లాడడానికి అవకాశం ఇవ్వకపోతే, ఇకధర్మాన్ని ఎవరు ఎక్కడ అమలులో పెడతారో అర్థంకాకుండా ఉన్నది. తమవంటివారు ఎక్కువ (శద్ధ తీసుకొని కృషిచేస్తారేమో అనుకొన్నాను నేను. వీరందరూ మిమ్మ ఏమంటారోనని భయపడిపోతున్నట్లున్నారు. మీరుకూడఇట్లాభయపడితే ఇకధర్మానికి ఏమిగతి పడుతుందో అర్థంకావడంలేదు. (ప్రభుత్వం అవినీతికి పాల్పడకుండా ఉండాలంటే తప్పనిసరిగా "(ప్రపంచమంతా మిధ్య"

అనేభావం కలగాలి. జన్మ మృత్యు, జరా, వ్యాధి, దుఃఖదోషా నిదర్శనం అన్నారు. జన్మఅంటే ఏమిటో, మృత్యువు అంటేఏమిటో, వృద్ధాప్యంఅంటే ఏమిటో, మరణంఅంటే ఏమిటో అందరికీ తెలియాలి. ఇవన్నీ ఒకప్పుడు అందరికీవస్తాయికదా! మరణంఅని వార్యమేకదా, అనేవిషయాలు తెలియాలి. ప్రపంచమంతా శాశ్వతంగా ఇక్కడవుండడానికి వీలులేదు. అనే విషయంతెలిసినప్పుడు మాత్రమే, వైరాగ్యంకలుగడానికి అవకాశంఉన్నది. అప్పుడు మాత్రమే సరైన నిజాయితీ ఏర్పడు తుంది. నిజాయితీ ఉంటే తప్ప, పరిపాలన సాగడానికి వీలులేదు. సంకుచితమైనభావాలు ఉన్నంతవరకు ఏదే శంగాని, ప్రాంతంగాని బాగుపడేఅవకాశంలేదు. ఈవిషయాలన్నీ దృష్టిలో పెట్టుకొని పనులు నిర్వర్తిం చినట్లయితే అన్యాయము జరుగకుండ యుండటమేగాక అదిఒక preventive method గా గోచ రిస్తుంది. రోగంరాకపూర్వమే అరికట్టేందుకు వీలున్నది. కాబట్టి ప్రభుత్వంవారు ధర్మస్థాపనకై కొంత డబ్బుఖర్చుపెట్టి కృషిచేయాలి. తిరుపతి దేవాలయం నిధిలోనుంచి కొంతడబ్బు దీనికై కేటాయించాలని అందులో ప్రతినిధిగావున్న శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డిగారితో నేను చెప్పాను. వారు సరే అనిచెప్పారేగాని చేతల వల్ల ఏమీ కనిపించడములేదు. ఇప్పుడైనా ప్రభుత్వంవారు దయచేసి కొంతడబ్బువెచ్చించి తగిన శ్రద్ధతీసుకోవాలని కోరుతున్నాను.

మనదేశంలో సోషలిస్టు సమాజాన్ని ఏర్పాటు చేసుకోవాలంటున్నారు. ఒక కుటుంబానికీ, మరొక కుటుంబానికీ తేడా ఉండకూడదు. ఆర్థికవిధానంలోనూ,అధికారంలోనూ, ఎందులోచూచినప్పటికిన్నీ, ఎక్కు వతేడాలు ఉండకూడదు. పైవారు క్రిందికి రావాలి. క్రిందివారు పైకిపోవాలి. అప్పుడు మాత్రమే సామరస్యం కుదురుతుంది. పైవారు క్రిందికి రావాలంటే ఈనాడు ordinances చాలు. వీటివల్ల పైవారిని క్రిందికితేవచ్చును. జమిందారులులేరు. Land reforms వల్ల పెద్దభూస్వాములు అంతరించవచ్చును. పైవారిని క్రిందికితీసుకురావడం పెద్దసమస్యకాదు. క్రిందివారు పైకిఎట్లా పోవాలి అనేదే యీనాటిసమస్య. ఒకవ్యక్తిగాని, కూలీవర్గంగాని, ఉద్యోగస్తులుగాని, ఈనాడే ఎంతమంది (అభివృద్ధిలోకి) పైకివస్తున్నారో అర్థంకావడంలేదు. నేటిరోజులలో నాగరికత పెరిగింది, అంటూఉన్నారు. నిజమైన నాగరికత ఎక్కడా అగుపించడంలేదు. నేటి ఉద్యోగులు వారికి ఎంత ఆదాయం వస్తూన్నా ఇంకా చాలడం లేదనుకుంటున్నారు. నేటిపరిస్థితులనుబటి దేశంలో విప్లవం బయలుదేరు తుందేమోనని అనుమానం కలుగుతున్నది.

పల్లెలలోనున్న కూలీలమంచి, రైతులనుంచి పట్నవాసాల మీదికి విప్లవం ప్రారంభమవుతుంది. పల్లెల లోని వారు పట్నవాసాలకు వచ్చి ఇక్కడవారు అనుభవించే భోగ సంపదలన్నీ చూచారు. వీరి ఆర్భాటా లన్ని చూచారు. వారి కడుపులో మంట పుట్టింది. ఇది మానవ స్వాభావికము, సహజము కదా! "మనం అనేక కష్టాలనుభవిస్తున్నాం, వీరు భోగ భాగ్యాలనుభవించుతూ 'ఇంకా పండించండి, ఇంకా పండించండి' అని పైగా దబాయించుతున్నారు. కాని దానికి అనుమైన అవకాశం కల్పించడంలేదు." అని వారిలో బాధ కలుగుతున్నది. "ప్రభుత్వం వారు రైతుల కష్టములు పరిశీలించకుండా యుండడమే. ఇంకా ఎన్నిరకాల పన్నులు వేసే అవకాశము ఉన్నది." అని ఆలోచించేటట్లయితే ఇది ప్రజలందరికీ చాలా అసహ్యాన్ని కలి గిస్తుంది. గాన రైతు, రైతుకూలీలనుండి విప్లవం బయలు దేరే అవకాశముంది. ఇప్పుడు జమీందారులు రాజాధిరాజులు తమ "పెరుగుట విరుగుట కొరకే" అన్నట్లుగా వారు "అతి" చేసుకొనుటవల్ల

పతనాన్ని పొందారు. ఈనాడు పల్లెలలో ఉన్నవారు ఎంతఅభివృద్ధి లోనికి వస్తున్నారు. అసలు వారి అభివృద్ధి అంటే ఏమిటి, 10 సంవత్సరముల క్రిందట వారిస్థితి ఏమిటి, ఈ నాడు ఏ పరిస్థితిలోఉన్నారు. వారిలో నాగరికత ఏమి పెరిగింది, వారు అనుభవించే సుఖం ఏమిటి ? వారు ఈ నాడు ఎందుకు అప్పుల పాలు అయినారు, అప్పులు తీర్చలేని పరిస్థితిలో ఎందువల్ల ఉన్నారు. ఎందువల్ల పన్నులు చెల్లించలేని స్థితిలో ఉన్నారు ? అని ఆలోచించే వారెవరైనా ఉన్నారా? నేషనలు సేవింగ్స్ విషయములో ఇంకా పల్లెలను ండే వసూలు కావాలంటున్నారు ఆర్థిక మంత్రిగారు. ఇంతకంటే ఘోరం ఇంకొకటి ఉంటుందా? నిజంగా పల్లెలలో డబ్బు ఉన్నదా ? పల్లెలనుంచి కొల్లగొట్టి తెచ్చి ఈ హైదరాబాదు నగరాన్ని బాగుచేశారు. ఇదంతా పల్లెప్రజల రక్తంకాదా? ఈ భవనాలన్నీ ఎక్కడివి? ఇప్పుడు ఆయుగం వచ్చింది. ఏ సిటీ (city) మీద ఎప్పుడు బాంబు పడుతుందో అని భయంగా ఉన్న ఈ రోజుల్లో మనకు పెద్ద పెద్ద భవనాలు ఎందుకు ? చిన్న భవనాలు కట్టుకుంటే సరి పోతుంది ప్రభుత్వానికి సంబంధించిన buildings తప్ప ఇతర buildings ఏవీకూడ 20 వేల రూపాయల కంటే ఎక్కువ ఖర్చుతో కట్టకూడదని ఒక ఆర్డినెన్సు జారీ చేస్తే బాగుంటుంది.

మంత్రులకు allot చేసిన ఇండ్లు కూడా చాలా simple గా ఉండాలి. మనం ఖర్చులను తగ్గించడం నేర్చుకోవాలి. హైదరాబాదు వచ్చిన తరువాత మన ఖర్చులు పెరిగిపోయినాయి. ఖర్చులను తగ్గించుకోడానికిప్రయత్నిస్తే ప్రజానీకంకూడా ప్రభుత్వంతో అంగీకరిస్తుంది. లేక పోతే చాలా బాధ పడుతుంది. జమీందారుల కాలంలో కంటే ఎక్కువపన్నులు వేస్తే, జమీందారులకంటే ఎక్కువ భోగభాగ్యాలను భవిస్తూ city లను అభివృద్ధి చేసుకొంటూ, నాగరికతను విద్యావంతులకే పరిమితంచేసి, ఎక్కువ సౌకర్యాలను కలుగజేస్తే ఇక పల్లె ప్రజానీకానికి మనం చేసిన మేలు ఏమిటి ? మనం గ్రామాలలో, పల్లెలలో మారు మూలల ఉండే ప్రజానీకం యొక్క అవస్థలను గమనించకుండా, వారిగోడును వినలేకుండా 10-20 సంవత్సరాలనుంచి వారి స్థితిగతులను విచారించలేక పోతున్నామంటే, వారి అభివృద్ధి,వెనుక బడినతనం మున్నగువాటి వివరాలు తెల్సుకోలేక పోతున్నామంటే యిది చాలా దారుణ పరిస్థితికి దారితీస్తుంది.

ఇందుకోసం ఒక రిజిష్టరును maintain చేయడం చాలా అవసరం. ఏ యే సంవత్సరాలలో వారికి బడ్జెట్ ఎంత ఉన్నదో , ఏమి పనులు చేయాలో ఆ పనులు ఎట్లా జరుగుతున్నాయో అనే విషయాలన్నీ రిజిష్టరులో వ్రాసుకోవాలి. రెండురోడ్లు వేయడంవల్ల కాని, రెండుబావులు త్రవ్వినందువల్ల గాని ప్రజానీకం అభివృద్ధిలోకి రాలేరు. వాటి maintinance కూడా చాలా అవసరంగాన ప్రజలయొక్క ఆర్థికవిధానం పెంపొందాలి. మనకు ఏ పని కావాలన్నా రైతు ఎంతో అవసరం. రైతులు వ్యవసాయంచేయుడానికి నీరు ముఖ్యవసరం . తగిన బలం వేస్తే పంటలు బాగా పండుతాయంటారు. ఇప్పుడు తెగుళ్ళు విపరీతంగా పెరిగి పోయాయి. పంట అంతా తెగుళ్ల వల్ల నాశనం అయిపోతున్నది. చేసినకృషి అంతా వ్యర్థమై పోతున్నది. రైతులు లేకపోతే మనకు రాజ్యమే లేదు కదా ! పంటలు పండక పోతే మనకు starling హెచ్చు రాదు కదా! వెన్నెముక వంటి రైతు పైననే, వారి కష్టముపైన ఆధారపడియుంటూ వారిపైన పెత్తనం చేయడంవల్ల విపరీత పరిస్థితులకు దారితీస్తుంది. వారనుభవించే అవస్థలన్నీ ఈనాగరికులు కూడ పొందవలసి వస్తుంది. అనుభవము తెలుస్తుంది.

"మీరంతా ఒకసారి పల్లెలకు వెళ్ళండి, కొంతకాలము మేము పరిపాలన వగైరా పట్టణాల జీవితం చేస్తాము" అని వారు అంటే అప్పుడు మన స్థితి ఏమి కావాలి ? మనం యీ విషయాన్ని గుర్తించి శాశ్వతంగా మనం యిక్కడనే ఉండి నాగరికతననుభవించడానికి అవకాశంలేదు. పల్లె ప్రజలను కూడా దృష్టిలో పెట్టుకోవలసిన అవసరమున్నదని మనవి చేస్తున్నాను. రైతులు పంటలు పండించడానికి నీరు, బలంకావాలి. తెగుళ్ళు రాకుండా చేయాలి, అట్లు చేస్తేనే వ్యవసాయం బాగుపడుతుంది. వ్యవసాయం fail కావడానికి కారణాలు ఏమిటి ? మన భవిష్యత్తు అంతా పంటల పైననే ఆధారపడి, రైతుల చేతిలో ఉన్నది. ఇప్పుడు తెగుళ్ళ పీడిస్తున్నాయి. కోట్లకొలది రూపాయలు ఖర్చుపేసి అయినా తెగుళ్లను నివారిస్తే తప్ప మనంబాగుపడే అవకాశం లేదు. కాబట్టి తెగుళ్ల నివారణకు research చేయించాలని మనవి చేస్తున్నాను. నాకీ అవకాశం ఇచ్చిన అధ్యక్షుల వారికి ధన్యవాదాలర్పిస్తూ విరమిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్:—3వ తేదీ ఉదయం8 1/2 గంటలవరకూ సమావేశం వాయిదావేయడమైనది.

The House then adjourned till half past eight of the clock on Monday the 3rd March 58.

---

